# రత్నావళి

విశ్వవిద్యాలయం బి.ఏ. బి.యస్‌సి. బి.కామ్. మొదటి భాగం

## తెలుగు పద్య పాఠ్యగ్రంథం

( 1981 – 82 సంవత్సరమునకు )




ప్రచురణ

తెలుగు విభాగము

కాకతీయ విశ్వవిద్యాలయము

విద్యారణ్యపురి – 506 009

1981

# 1. భీమ ప్రతిజ్ఞ

## నన్నయ భట్టు

(ఆంధ్ర మహాభారతము - సభాపర్వము - ద్వితీయాశ్వాసము)

అవనినాథు చేత నాజ్ఞాపితుం డయి
సూతనందనుండు ప్రాతికామి
పాండవాగ్రమహిషిపాలికిఁ జని భక్తి
వినతుఁ డగుచు నిట్టులనియె సతికి.

ధనసంపదలు నిజధరణీరాజ్యంబు ననుజులం దమ్ములఁ దన్నును నిన్ను
దనర జూదంబాడి ధార్తరాష్ట్రులకు ధర్మతనూజుండు తానోటువడియె
వనజాక్షి కౌరవవరుపని నిన్ను వడిఁ దోడుకొనిపోవ వచ్చితి నిపుడ
చనుదెమ్ము కౌరవేశ్వరుకడ కనిన జలజాయతాక్షి పాంచాలి యిట్లనియె?

ఏ యుగంబునందు నెట్టి దుష్కృతవుండు
భార్య నొడ్డి యోటువడిన భర్త
కలఁడె యిదివినంగఁ గడు నపూర్వంబయ్యె
నిట్లు చేయునొక్కొ యిందుకులుఁడు

మున్ను తన్నోటువడి మఱి నన్ను నోటు
వడియెనో నన్ను మున్నోటువడి విభుండు
క్రిన్నఁ దన్నోటువడియెనో యన్న! నాకు
నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగు దేని.

ఎఱుంగవేని యక్కితవు నడిగి వచ్చి మఱి నన్నుందోడ్కొనిపోవ నగునేని తోడ్కొని పొమ్మనినం బ్రాతికామి క్రమ్మరివచ్చి పాంచాలి పలుకులు ధర్మరాజునకుంజెప్పిన దురోదర పరాజయ దుఃఖిత చేతస్కుండగుటఁ జేసి యతఁడు వానికి నదత్తప్రతివచనుండైనఁ బ్రాతికామికి దుర్యోధనుం డిట్లనియె.

# రత్నావళి

కాకతీయ విశ్వవిద్యాలయం బి.ఏ. బి.యస్‌సి. బి.కామ్. మొదటి భాగం

## తెలుగు పద్య పాఠ్యగ్రంథం

( 1981 – 82 సంవత్సరమునకు )




ప్రచురణ

తెలుగు విభాగము

**కాకతీయ విశ్వవిద్యాలయము**

విద్యారణ్యపురి - 506 009

**1981**

# RATNAVALI

Classical Poetry Selections for B.A., B.Sc., B.Com.
PART I TELUGU
for the academic year 1981-1982
Copies 1000

Editors
**Prof. Rajeswara**
**Dr. H. Sivakuma**
**Sri M. Appalacharya**





First Print 1980
Second Print 1981

**PRICE Rs. 4-00**

*Copies can be had from:*
**The Head, Department of Telugu**
Kakatiya University, Warangal

Printed at:
Venkataramana Mudranalayam

# విషయ సూచిక

# తొలిపలుకు

కాకతీయ విశ్వవిద్యాలయము బి.ఏ.,బి.కామ్.,బి.యస్‌సి. విద్యార్థులు అవశ్యపఠనీయముగా ప్రాంతీయ భాషను చదువవలసియున్నది. తెలుగు ప్రాంతీయ భాషగా చదువువారికై కూర్చబడిన ప్రాచీన కావ్య రత్నావళి యిది.

తెలుగు ఈనాడు భారత దేశమునందు ముఖ్యములయిన భాషలలో నొకటి. మాట్లాడువారి సంఖ్యనుబట్టి చూచినచో తెలుగు రెండవ స్థానము నాక్రమించును. సుమారైదుకోట్ల జనము తెలుగును మాట్లాడుచున్నారు. తెలుగు మాట్లాడువారు ఆంధ్రప్రదేశము నందేకాక పొరుగురాష్ట్రములయిన ఒరిస్సా తమిళనాడు కర్ణాటక మహారాష్ట్ర మధ్యప్రదేశములలోగూడ చెప్పుకొనదగినంత సంఖ్యలో నున్నారు. సుదూర దేశములయిన అమెరికా ఆఫ్రికా మలేషియావంటి దేశములలోను ఉన్నారు.

తెలుగుకు వేయి సంవత్సరముల సాహిత్య చరిత్రమున్నది. భారతీయ భాష లనేకములకంటె పూర్వమే తెలుగులో సాహిత్యము సృష్టింపబడినది. నన్నయ తెలుగులో మొదటి కవియని సామాన్యముగా చెప్పుకొనుచున్నను నన్నయకు పూర్వము చాలాకాలము క్రిందటనే తెలుగులో సాహిత్యసృష్టి జరిగినదని యూహించుటకు గావలసిన సాధన సామగ్రి కావలసినంత లభించినది. నన్నయ తెలుగుభాషను సంస్కరించి మహాభారత రచన కావించెనని యింకను కొందరు చెప్పుకొనుచున్నను నన్నయకు పూర్వమే ఆంధ్రభాషకు ఒక నిర్దిష్టమయిన రచనా విధానము ఏర్పడినదని, నన్నయ కేవలమావిధానమును మాత్రమే అనుసరించెనని నిర్ణయించుటకు వీలయిన శాసనములు కావలసినన్ని దొరికినవి.

ఆంధ్రభాషా ప్రగతిని ఆదినుండి పరిశీలించినచో నీ భాష ఇతరములయిన పెక్కుభాషలతో సహజీవనము నెరపి వానినుండి తనకు కావలసిన పుష్టిని చేకూర్చుకొన్నదని గ్రహించగలము. సంస్కృతభాషలవలన తెలుగుకు

# తొలిపలుకు

కాకతీయ విశ్వవిద్యాలయము బి.ఏ.,బి.కామ్.,బి.యస్‌సి. విద్యార్థులు అవశ్యపఠనీయముగా ప్రాంతీయ భాషను చదువవలసియున్నది. తెలుగు ప్రాంతీయ భాషగా చదువువారికై కూర్చబడిన ప్రాచీన కావ్య రత్నావళి యిది.

తెలుగు ఈనాడు భారత దేశమునందు ముఖ్యములయిన భాషలలో నొకటి. మాట్లాడువారి సంఖ్యనుబట్టి చూచినచో తెలుగు రెండవ స్థానము నాక్రమించును. సుమారైదుకోట్ల జనము తెలుగును మాట్లాడుచున్నారు. తెలుగు మాట్లాడువారు ఆంధ్రప్రదేశము నందేకాక పొరుగురాష్ట్రములయిన ఒరిస్సా తమిళనాడు కర్ణాటక మహారాష్ట్ర మధ్యప్రదేశములలోగూడ చెప్పుకొన దగినంత సంఖ్యలో నున్నారు. సుదూర దేశములయిన అమెరికా ఆఫ్రికా మలేషియావంటి దేశములలోను ఉన్నారు.

తెలుగుకు వేయి సంవత్సరముల సాహిత్య చరిత్రమున్నది. భారతీయ భాష లనేకములకంటె పూర్వమే తెలుగులో సాహిత్యము సృష్టింపబడినది. నన్నయ తెలుగులో మొదటి కవియని సామాన్యముగా చెప్పుకొనుచున్నను నన్నయకు పూర్వము చాలాకాలము క్రిందటనే తెలుగులో సాహిత్యసృష్టి జరిగినదని యూహించుటకు గావలసిన సాధన సామగ్రి కావలసినంత లభించి నది. నన్నయ తెలుగుభాషను సంస్కరించి మహాభారత రచన కావించెనని యింకను కొందరు చెప్పుకొనుచున్నను నన్నయకు పూర్వమే ఆంధ్రభాషకు ఒక నిర్దిష్టమయిన రచనా విధానము ఏర్పడినదని, నన్నయ కేవలమావిధాన మును మాత్రమే అనుసరించెనని నిర్ణయించుటకు వీలయిన శాసనములు కావలసినన్ని దొరికినవి.

ఆంధ్రభాషా ప్రగతిని ఆదినుండి పరిశీలించినచో నీ భాష ఇతరము లయిన పెక్కుభాషలతో సహజీవనము నెరపి వానినుండి తనకు కావలసిన పుష్టిని చేకూర్చుకొన్నదని గ్రహించగలము. సంస్కృతభాషలవలన తెలుగుకు గలిగినలాభము సుప్రసిద్ధమయినది. అట్లే ప్రాకృతి భాషలవలనగూడ తెలుగు

తొలినాళ్లలో కొంత పుష్టినందినది. సంస్కృత ప్రాకృతములు రాజభాషలుగా నుండిన కాలములో నా భాషాపదములెన్నో తెలుగులో జేరినవి. సంస్కృత సాహిత్య మర్యాదలు, సంస్కృత గ్రంథములు, ప్రాకృత సాహిత్యమర్యాదలు ప్రాకృత గ్రంథములు తెలుగులోనికి వచ్చినవి. అటుతరువాత కాలములో తమిళ కర్ణాటక సాహిత్యముల మర్యాదలు, ఆ భాషాపదములుకూడ తెలుగులో చోటు చేసికొన్నవి. తమిళదేశమున బుట్టి వ్యాప్తిచెందిన వీరశైవ సంప్రదాయము దీని కవకాశమును కల్పించినది. అటు తరువాత మనకు అరబ్బీ పార్శీభాషలతో కొంత సంబంధము కలిగి ఆయా భాషలవలన గూడ తెలుగు కొంత ప్రభావితమయినది. ఇట్లే పోర్చుగీసు డచ్చివారితో మనదేశమునకు సంబంధము కలిగి ఆయా భాషలవలన గూడ కొంత ప్రభావితమయినది. ఆంగ్లేయుల పరిపాలన మారంభించిన పిదప మనభాషలో నేర్పడిన మార్పులు ప్రత్యేకముగా నొక గ్రంథము వ్రాయదగియున్నవి. మహమ్మదీయుల పరిపాలన వలన ఉర్దూభాషతో సహజీవనమబ్బినది. కనుక తత్ప్రభావము కూడ కనుపట్టును. ఈనాడు ప్రపంచమంతటితోను మనకు సంబంధము లేర్పడినవి. కనుక తత్ప్రభావము కూడ సహజమనుట గుర్తింపదగినది.

భాషాశాస్త్రజ్ఞులు తెలుగునకున్న ఒక విశిష్ట లక్షణమును గుర్తించియున్నారు. ఏభాషాపదముల నయినను తెలుగు తేలికగా తనలో చేర్చుకొనగలదు. ఈ లక్షణమే ఆంధ్రభాషా చరిత్రలో మనకడుగడుగున కానవచ్చుచుండును. కనుక ఈభాష యీవిశిష్టగుణ మాధారముగా నెంతయిన వృద్ధి బొందు నవకాశమున్న దన్నమాట.

సాహిత్యమును బట్టి చూచినచో తెలుగు చాలా ప్రాచీనములయిన కొద్ది భారతీయ భాషలలో నొకటియని యిదివఱకే చెప్పబడినదికదా! మనకు లభించిన వానిలో నన్నయ భారతము మొట్టమొదటిది. కాని యిట్లు మొట్టమొదటి గ్రంథములే భాషలోను ఆ తరువాత వేయి సంవత్సరముల నాడున్నవారి కర్థముకావు. మనభాషలో అట్లుకాక నన్నయ భారతము వేయిసంవత్సరముల నాడు వ్రాయబడినను ఈనాటివారికి సుగమముగా నర్థమగుచున్నది. అట్లని

తొలినాళ్లలో కొంత పుష్టినందినది. సంస్కృత ప్రాకృతములు రాజభాషలుగా నుండిన కాలములో నా భాషాపదములెన్నో తెలుగులో జేరినవి. సంస్కృత సాహిత్య మర్యాదలు, సంస్కృత గ్రంథములు, ప్రాకృత సాహిత్యమర్యాదలు ప్రాకృత గ్రంథములు తెలుగులోనికి వచ్చినవి. అటుతరువాత కాలములో తమిళ కర్ణాటక సాహిత్యముల మర్యాదలు, ఆ భాషాపదములుకూడ తెలుగులో చోటు చేసికొన్నవి. తమిళదేశమున బుట్టి వ్యాప్తిచెందిన వీరశైవ సంప్రదాయము దీని కవకాశమును కల్పించినది. అటు తరువాత మనకు అరబ్బీ పార్శీభాషలతో కొంత సంబంధము కలిగి ఆయా భాషలవలన గూడ తెలుగు కొంత ప్రభావితమయినది. ఇట్లే పోర్చుగీసు డచ్చివారితో మనదేశమునకు సంబంధము కలిగి ఆయా భాషలవలన గూడ కొంత ప్రభావితమయినది. ఆంగ్లేయుల పరిపాలన మారంభించిన పిదప మనభాషలో నేర్పడిన మార్పులు ప్రత్యేకముగా నొక గ్రంథము వ్రాయదగియున్నవి. మహమ్మదీయుల పరిపాలన వలన ఉర్దూభాషతో సహజీవనమబ్బినది. కనుక తత్ప్రభావము కూడ కనుపట్టును. ఈనాడు ప్రపంచమంతటితోను మనకు సంబంధము లేర్పడినవి. కనుక తత్ప్రభావము కూడ సహజమనుట గుర్తింపదగినది.

భాషాశాస్త్రజ్ఞులు తెలుగునకున్న ఒక విశిష్ట లక్షణమును గుర్తించియున్నారు. ఏభాషాపదముల నయినను తెలుగు తేలికగా తనలో చేర్చుకొనగలదు. ఈ లక్షణమే ఆంధ్రభాషా చరిత్రలో మనకడుగడుగున కానవచ్చుచుండును. కనుక ఈభాష యీవిశిష్టగుణ మాధారముగా నెంతయిన వృద్ధిచెందు నవకాశమున్న దన్నమాట.

సాహిత్యమును బట్టి చూచినచో తెలుగు చాలా ప్రాచీనములయిన కొద్ది భారతీయ భాషలలో నొకటియని యిదివఱకే చెప్పబడినదికదా! మనకు లభించిన వానిలో నన్నయ భారతము మొట్టమొదటిది. కాని యిట్లు మొట్టమొదటి గ్రంథములే భాషలోను ఆ తరువాత వేయి సంవత్సరముల నాడున్నవారి కర్థముకావు. మనభాషలో అట్లుకాక నన్నయ భారతము వేయిసంవత్సరముల నాడు వ్రాయబడినను ఈనాటివారికి సుగమముగా నర్థమగుచున్నది. అట్లవి

నన్నయ నాటి భాష యేమాత్రము మార్పులేక యిప్పటివరకట్లే యున్నదనుట మాత్రము కాదు. ఏజీవద్భాషయయినను మార్పులు పొందుట సహజము. తెలుగుకూడ నట్లేమార్పులు పొందినది. ఇప్పుడు కూడ మార్పులు పొందు చున్నది. మునుముందు కూడ మార్పులు పొందగలదు. అయినను ఈభాషలో నొక యంతస్సూత్రము అవిచ్ఛిన్నముగా దాని యేకతను కాపాడుచున్నది. కనుకనే నన్నయగారి భారతము మనకు పాతదిగా కనపడకపోవుట.

ఏ జాతికైనను ప్రాచీన సాహిత్యము గర్వకారణమయిన పెన్నిధి వంటిది. తెలుగువారి కట్టి పెన్నిధికలదు. ఇట్లని యిక సాహిత్యాభివృద్ధికి కృషిచేయు నవసరములేదని కాదు. అది నిరంతరము సాగుచుండవలసినదే. క్రొత్తక్రొత్త రచనలు క్రొత్త క్రొత్త ప్రక్రియలు మన సాహిత్యమున ఎప్పుడును బయలుదేరవలసినదే. ఆవిధముగా భాషాసాహిత్యములు వృద్ధిచెందవలసినదే. క్రొత్త రచనలు పాతరచనలు కూడ మన సాహిత్య గౌరవమును చెందునవి యని మాత్రమే మనము గుర్తింపదగినది.

నన్నయాదుల భారతరచనము అనువాదమే అయినను సంస్కృతమున లేని యెన్నో సొబగులను సంతరించుకొని స్వతంత్ర రచనమువలె సాగినదని ఆగ్రంథములను పోల్చిచూచినచో స్పష్టముకాగలదు. పాల్కురికి సోమనాథు డట్లే తన పండితారాధ్య చరిత్ర బసవపురాణములలో పెక్కురు తమిళ కర్ణాట దేశీయుల కథలను చేర్చినను వానికి దేశీయతాముద్రను సంతరించినాడని పరి శీలించినచో మనము గుర్తింపగలము. మనప్రబంధమునకుమూలముసంస్కృత మహాకావ్యమే యయినను దాని వ్యక్తిత్వము దానికున్నదని విమర్శకు లంద రును గుర్తించినారు. ఇది మనయాధునిక సాహిత్యప్రక్రియలకు వర్తించు లక్షణము. కనుకనే ఆంధ్రసాహిత్యము ఆంధ్రభాషవలెనే ఇతర భాషలవలన పుష్టినందినను దాని వ్యక్తిత్వము దానికున్నదనుట. ఈ లక్షణమే లేనిచో నే సాహిత్యమును సాహిత్య గౌరవమునందదు. ఆంధ్రసాహిత్యము ఆ గౌర వమునంది పేరుపొందినదని వేరుగా చెప్పనవసరము లేదుకదా!

ఈ సంకలనమునందే ప్రాచీన కవులలో ముఖ్యులయిన వారి రచనల నుండి మనోహరములయిన ఘట్టముల నేరి పఠనీయములుగా కూర్చుటకు ప్రయత్నము చేయబడినది. నన్నయ తిక్కన శ్రీనాథుడు పోతన చేమకూర వేంకటకవి కంకంటి పాపరాజుల రచనల నుండి పాఠ్యము తీయబడినవి. మఱికొన్ని యితర కవుల రచనలనుగూడ నిచ్చిన బాగుండెడిదే కాని మరి నియమిత సమయమొకటి కలదుగదా! అంతేకాక విద్యార్థు లీపాఠ్యములను జదివి పరీక్ష వ్రాయవలసియున్నది. ఈ కారణములచేత నింతటితోనే తృప్తి పొందవలసి వచ్చినది.

గ్రంథాంతమున కవిపాఠ్య పరిచయాదు లీయబడినవి. అవి సమగ్రముగా సన్నివిషయములను వివరించ వలయునని కాక మార్గదర్శకములుగా నుండవలయునని మాత్రమే యుద్దేశింపబడినది.

అచ్చుతప్పులు దొర్లకుండ నుండవలయునని యెంతో జాగ్రత్త పడినను అక్కడక్కడ నర్థావగతికి గూడ నిబ్బంది కలుగునట్లుగా ముద్రణదోషములు దొరలినవి. సోదరోపాధ్యాయులు ఆయా దోషములను సవరించి సాయపడ గలరని కోరుచున్నాము.

సంపాదకులు

# 1. భీమ ప్రతిజ్ఞ

## నన్నయ భట్టు

(ఆంధ్ర మహాభారతము - సభాపర్వము - ద్వితీయాశ్వాసము)

అవనినాథు చేత నాజ్ఞాపితుండయి
సూతనందనుండు ప్రాతికామి
పాండవాగ్రమహిషిపాలికిఁ జని భక్తి
వినతుఁ డగుచు నిట్టులనియె సతికి. 1

ధనసంపదలు నిజధరణీరాజ్యంబు వసుధేశులం దమ్ములఁ దన్ను నిన్నుఁ
దనర జూదంబాడి ధార్తరాష్ట్రులకు ధర్మతనూజుండు తా నోటువడియె
వనజాక్షి కౌరవవరుపని నిన్ను వడిఁ దోడుకొనిపోవ వచ్చితి నిపుడ
చను మెచ్చు కౌరవేశ్వరుకడకు నిను జలజాయతాక్షి పాంచాలి యిట్లనియె?

ఏ యుగంబునందు నెట్టి దుష్కృతవుండు
భార్య నొడ్డి యోటువడిన భర్త
కలఁడె యిది వినంగఁ గడు నపూర్వంబయ్యె
నిట్లు చేయు నొక్కఁ డిందుకులుఁడు 3

మున్ను తన్నోటువడి మఱి నన్ను నోటు
వడియెనో నన్ను మున్నోటువడి విభుండు
క్రిన్నఁ దన్నోటువడియెనో యన్న! నాకు
నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగు దేని. 4

ఎఱుంగవేని యక్కృతవు నడిగి వచ్చి మఱి నన్నుం దోడ్కొనిపోవ నగునేని తోడ్కొని పొమ్మనినం బ్రాతికామి క్రమ్మరివచ్చి పాంచాలి పలుకులు ధర్మరాజునకుం జెప్పిన దురోదర పరాజయ దుఃఖితచేత-స్కుండగుటఁ జేసి యతఁడు వానికి నవత్తప్రతివచనుండైనఁ బ్రాతి

క. సందిగ్ధమయిన యర్థము
నిందఱసన్నిధిన యడిగి తెంద తెలుంగన్
సుందరిఁ బాంచాలేంద్రసు
తం దోడ్కొని రమ్ము పొమ్ము తఁయక యనినన్. 6

వ. వాఁడును ద్రౌపది పాలికింబోయి దేవి! నీ యడిగిన యర్థంబ నిర్ణ
యించువారై సభ్యులు నిన్ను రాఁబంచిరి రమ్మనిన దుర్యోధను డుశ్చే
ష్టితంబునకు ధర్మరాజు సమ్మతంబునకు వెఱచి యక్షోమలి ప్రాతికామి
పిలుంద నేకవస్త్రయు సవిరళగళిత నయనోదక బిందు సందోహాయు
నగుచు సభకుంజనుదెంచి కురువృద్ధుసమీపంబున నున్నంత ద్రౌపదిం
జూద నోపక లజ్జితులయి దుఃఖాయమాన మానసులయి తలలు వాంచి
యున్న పాండవుల వైలక్ష్యం బుపలక్షించి సంతసిల్లి దుర్యోధనుండు
దుశ్శాసనుంబిల్చి ప్రాతికామి వృకోదరునకు వెఱచు నీవు పోయి
ద్రౌపదిం దోడ్కొని రమ్మని పంచిన. 7

ఆ. నిర్దయాత్ముఁ బాపనిరతు దుశ్శాసనుఁ
బనుచు టెఱిఁగి కృష్ణ పంకజాక్షి
కడుభయంబు నొంది గాంధారి యొద్దకు
నరిగెఁ గడు వడంకి యతిరయమున. 8

చ. తడయక కౌరవానుజుఁడు దాని పిలుందన పాటి యింక నె
క్కడ కరుగంగఁ బోలుఁ జులుకం చనుదెమ్మిట సౌబలుండు ని
న్నొడిచె దురోదరంబునఁ గుహూర్త్తము సర్థమవైతి నిన్నునుం
బుతమిని దమ్ముఁ గోల్పడిరి పొల్తి భవత్పతులైన పాండవుల్. 9

వ. అనుచు డాయవచ్చిన "సక్కొమలి నన్నుముట్టకు మేకవస్త్ర
నయియున్నదాన గురు బంధుజనాధిష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తు
ననిన నీ వేకవస్త్రవైతేమి విగతవస్త్రవైతేమి నిన్నెట్లుం దోడ్కొని

ఉ. ఆ వనజాననం గురుకులాపశదుండు కడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్రపవిత్ర వారి ధా
రావళిఁ జేసి పావనములైన శిరోజములం దెసల్చి పా
పావహుఁ డీడ్చి తెచ్చె సభ కందఱు సంభ్రమ మంది చూడఁగన్. 11

వ. ఇట్లు వాతావధూతంబైన పతాకయుంబోలె దుశ్శాసనాపకృష్టయై ద్రౌపది వికీర్ణకేశయు వివర్ణవదనయునై కర్ణదుర్యోధన శకుని సైంధవాది దుష్టభూయిష్ఠంబైన సభకువచ్చికోపలజ్జాపరవశయయి. 12

చ. అనుపమ దైవయోగహతుఁడయ్యు నవశ్యము ధర్మసంపదం
దనరునకాక ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁ డొ
క్కనె కురువృద్ధులార భృశకోపనుఁ డీతడు నన్నునేల దు
ర్జనుఁ డిట యీడ్చితెచ్చి నవిచారపరుండయి దుర్మదంబునన్. 13

చ. ఇది యుచితంబు కాదనక యిక్కురుముఖ్యులు చూచుచుండ దు
ర్మదుఁడయి వీఁడు నన్ను నవమానితఁ జేసెడి సర్వధర్మ సం
విదులననున్న యీ భరతవీరుల వంశము నేఁ డధర్మ సం
పద నతినింద్య మయ్యె నని భామిని కృష్ణఁ దలంచె భీతయై. 14

వ. ఇట్లు జగత్త్రయ విజయ భుజవీర్య సనాథులైన నాథులు కలిగియు ననాథయుంబోలెఁ బాంచాలరాజపుత్త్రి భయార్తయై యార్త జనశరణ్యుండైన జగన్నాథు జనార్దనుం దలంచుచుఁ గపటద్యూత మధు మదోన్మత్తుండైన ధర్మపుత్త్రు నిమిత్తంబున నుద్గతంబయిన పాండవ పరాజయదహనంబుఁ దన రూక్షకటాక్షవీక్షణ వచనంబులఁ బ్రవర్తించుచున్నదానిఁ జూచి దుఃఖితుండై భీమసేనుండు ధర్మరాజున కిట్లనియె. 15

క. ధన కనక రత్న వరవా

మ్మను నోటు వడుట యుచితమ
యినసన్నిభ! పీని కెల్ల నీవు(డవగుటన్. 16

క. ద్రుపదతనూజం బణముగ(
గపట ద్యూతమున( జేయ(గా దగునె జనా
ధిప యిది దుష్టద్యూతము
నెపమున( బరిభూత యయ్యె నిష్కారుణులచేన్. 17

వ. శకుని కైతవం బెఱింగియుం బాపద్యూతంబు( బ్రవర్తించి యధర్మ
ప్రవృత్తుండ వయితి కావున భవద్బాహుదాహంబు సేయవలయునని
కోపించి పలికినం బవనతనయునకు నర్జునుం డిట్లనియె. 18

సీ. ధర్మతనూజుండు ధర్మువు దప్పిన
ధరణీతలం బెల్ల( దల్లడిల్లు(
దగిలి సుహృద్ద్యూత ధర్మయుద్ధములకు(
బరులచే( బిలువంగ(బడి విభుండు
కడ(గక విముఖుండుగా( జనదని శుభ
క్షాత్త్రధర్మంబు లోకంబులందు
నిలిపె( దానిది పతినేరమియే దైవ-
వైపరీత్యంబైన వసర( దగునె

ఆ. గురుల ధర్మపరుల( గోపించి ధీరుల
తిక్రమింతురే తదీయ నిత్య
ధర్మగౌరవం బధార్మికులగుచున్న
పరులచేత( జెఱుప( బడియె నిట్లు. 19

వ. అనుచు దుఃఖితు లగుచున్న పాండవులను దుశ్శాసనాపకృష్టయై సభాం
తరంబున నున్న ద్రౌపదిం జూచి వికర్ణుం డన్యాయ శ్రవణ వికర్ణులై
మిన్నకున్న సభ్యుల కిట్లనియె. 20

క. సమ చిత్తవృత్తులగు బు
ద్ధిమంతులకు నిపుడు ద్రౌపదీప్రశ్న విచా
రము చేయవలయు నవిచా
రమునఁ బ్రివర్తిల్లు టది నరకహేతువగున్. 21

వ. ఇక్కురువృద్ధులైన భీష్మ ధృతరాష్ట్ర విదురాదులును నాచార్యులయిన ద్రోణ కృపులుం బలుకరైరి యున్న సభాసదులెల్లం గామక్రోధాదులు దక్కి విచారించి చెప్పుఁడనిన నెవ్వరుం బలుకకున్న నే నిందు ధర్మ నిర్ణయంబు చేసెద నెల్లవారును వినుండు జూదంబును వేఁటయుఁ బానంబును బహుభక్షణాసక్తియు నను నాలుగు దుర్వ్యసనంబులం దగిలిన పురుషుండు ధర్మువుం దప్పి వర్తిల్లు నట్టివాని కృత్యంబులు చేకొనం దగవు కితవాహూతుండై వ్యసనవర్తియయి పరాజితుండ యిన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణ ధనంబయిన పాంచాలిఁ బణంబుఁజేసెంగావున ద్రౌపది యధర్మవిజిత యక్కోమలి నేకవస్త్రనిటఁ దోడ్కొని తెచ్చుట యన్యాయంబనిన వికర్ణు పలుకుల కోడబడక కర్ణుండు వాని కిట్లనియె. 22

ఆ. ఎల్లవారు నెఱుగనొల్లని ధర్మువు
బేల! నీకుఁ జెప్ప నేల వలసెఁ
జిఱుతవాని కింత తఱుసంటి పలుకులు
చన్నె వృద్ధ జనములున్న చోట.

వ. నీవు ద్రౌపది నధర్మ విజితయని పలికితి సభాసదు లెల్ల నెఱుంగ ధర్మ జుండు తన సర్వస్వమ్మునొడ్డి యోటువడినప్పు డిది వానికి వెలిగాదు కావున ధర్మవిజితయ యిట్లు కానినాడు పాండవు లిందఱును దీని విజిత గానేల యొడఁబడుదురు మఱి యేకవస్త్రయై యున్న దీని సభకుం దోడ్కొని వచ్చుట ధర్మువు గాదంటి భార్యకు దైవవిహితుండయిన భర్త యొక్కరుండ యిది యనేక భర్తృక కావున బంధకి యనంబడు

నిట్టిదాని విగత వస్త్రంజేసి తెచ్చిన ధర్మవిరోధంబులేదని
వికర్ణు వచనంబులకుం బ్రత్యాఖ్యానంబు చేసిన విని దుర్యోధనుండ
దుశ్శాసనుం బిలిచి యుపాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లప
రింపుమని పంచిన దాని నెఱింగి-

క. కితవవ్యవసాయ పరా
జితులగుటం జేసి బలిమిచెడి పాండుసుతుల్
ధృతిఁ దమ పయి పుట్టము లా
యతకీర్తులు మున్న పెట్టి యాసభ నున్నన్.

సీ. ఇది చేయఁ గాదని మది విచారింపక
సద్గర్హితుండు దుశ్శాసనుండు
నెట్టన ద్రౌపది కట్టిన పుట్టంబు
సభలోన విడ్చె నాశంక లేక
యుడుగక యొలువంగఁ బడియు మున్నపసీత
మైన తద్వస్త్రంబు నట్టి వలువ
లలితాంగి జఘన మండలమునఁ బాయక
యొప్పుచునున్న నయ్యువిదఁ జూచి

ఆ. సభ్యులెల్ల ముదితసమ్మదులయిరి దు
శ్శాసనుండు వస్త్రచయము పర్వ
తోపమాన మయిన నొలువంగ నోపక
యుడిగె లజ్జఁబొంది యుక్కు దక్కి. 26

వ. ఇట్లు భీమసేనుండు ద్రుపద రాజనందనకు దుశ్శాసనుండు చేసిన
యవమానంబు చూచి కోపాక్రాంతనయనుండగుచు నంతకాకారంబున
దంతసందష్టనారుణముఖుండయి యెల్లవారును విన నిట్లనియె. 27

మ. కురు వృద్ధుల్ గురువృద్ధబాంధవులనేకుల్ చూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు చేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని

వ. ఇట్లు చేయనైతినేని పితృపితామహులగతికిం దప్పినవాఁడ నగుదు ననిన నతని యతిమానుషంబయిన మహావ్యవసాయంబున కద్భుతం బంది దిక్కులు చూడక ధిక్ఛబ్దముఖరిత ముఖులగుచు సభాజనులు తమలో సపుత్త్రకుం డయిన ధృతరాష్ట్రు నిందించుచు ద్రుపదరాజపుత్త్రి వాక్యంబులు విచారింపక వృద్ధరాజు లుపేక్షించి రనుచుండి రంత నుద్వృత్తబాహుండయి విదురుం డెల్లవారిని వారించి యిట్లనియె. 29

మత్త. ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పరించి యథావిధిన్
దేవమంత్రియు బోలె ధర్మముఁ దెల్పె నీతని బుద్ధి మీ
రేవగింపక చేకొనుండిది యెల్లయుండును ధర్మన
ద్భావ మొక్కని కేర్పరింపఁగ బ్రహ్మకైనను బోలునే. 30

వ. కావున మీరును ద్రౌపదీ ప్రశ్నంబునందు ధర్మబుద్ధి చేయుండని విదురుఁడు పలికిన దుర్యోధనుభయంబున సభ్యులెవ్వరుం బలుకరైరి ద్రౌపదియు నట్లు సకల క్షత్త్రియ సమక్షంబున దుశ్శాసనుచేతం బరి భవింపబడి దుఃఖితయయి. 31

సీ. అవ్విధంబున నొప్పి యా స్వయంవరము నాఁ
డఖిలభూపతులచే నట్లు చూడఁ
బడి పాండవుల ధర్మపత్నినై గోవిందు
చెలియలనై వీనిచేత నిట్లు
పరిభూతనగుచు సభామధ్యమున మహీ
పతులచేఁ జూడంగఁబడితి నింత
పడుమనె యిపుడు నా పలుకుల కెవ్వరుఁ
బ్రతివచనం బేలపలుకరైరి
ధన్యులార! యేన దాసినే దాసినే
యెఱుఁగ జెప్పి పనుపుఁ డెల్లదాని
ననుచు వనరుచున్న నాపగాసుతుఁడు కాం

వ.	అవ్వా! నీ ప్రశ్నంబులకు నుత్తరం బయ్యుధిష్ఠిరుఁడు చెప్పవలయుఁ
గానినాఁడు ధర్మసూక్ష్మత యెవ్వరికిని నెఱుంగ గహనంబు దీని
ఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతురని పలుకుచున్న
యవసరంబున నక్కోమలిం జూచి నగుచు- 33

తే.	రమణి! యేవురపంచె నొక్కరుఁడ భర్త
యగుట లగ్గు జూదంబున నాలి నోటు
పడిని వానిఁగాఁ దగు భర్తఁ బడయు మింక
ననుచు రాధేయుఁ డుల్లసమాడె నంత.

ఉ.	అమ్మదితన్ విభీతహరిణాక్షిఁ గలాపవిభాసికేశభా
రమ్మున నొప్పుదానిఁ దనరమ్య బృథూరుతలంబు నెక్కఁగా
రమ్మని సన్నచేసె ధృతరాష్ట్రసుతాగ్రజుఁ డప్డు దాని దూ
రమ్మునఁ జూచి కౌరవకురంగమృగేంద్రుఁడు భీముఁ డల్కతోన్. 35

క.	లయసమయ దండధర ని
ర్దయుఁడై ధరణీశు లెల్లఁ దన పలుకులు వి
స్మయ సంభ్రమ భయ సంభృతు
లయి వినుచుండంగ నిట్టు లనియెన్ సభలోన్. 36

ఉ.	ధారుణి రాజ్య సంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరు దేశమున నుండగఁ బిల్చిన యిద్దురాత్ము డు
ర్వార మదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్. 37

వ.	అని సర్వజన భయానక క్రోధావేశ విపటించయి యాయుధంబు
లున్న వలనికి దృష్టులు నలుపుచు నగ్రజుమొగంబు చూచుచున్న
భీమసేను నతిరౌద్రాకారంబు చూచి భీష్మ విదుర ద్రోణాదు లిది
కోపంబున కవసరంబుగాదని యతనిం బ్రశాంత చిత్తుం జేసిరి. 38

# 2. భేదోపాయము

## తిక్కన సోమయాజి

(ఆంధ్ర మహాభారతము - ఉద్యోగ పర్వము - చతుర్థాశ్వాసము)

వ. అని పలికి పుండరీకాక్షుం గౌఁగిలించికొని యచ్యుతుండు మొక్కిన దీవించి కుంతి యేను సుఖంబున్నదాన నని పాండవులకుం జెప్పుము చేతుల లావునంగనిన జీవనంబున బ్రదుకుండనుము పొమ్మనిన నేడు కొల్పిన సింహగమన సుందరంబుగా వెడలి తన తోడఁ గదలివచ్చిన ధృతరాష్ట్రాదుల నిలువం బనిచి రథారోహణంబుసేసి గోవిందుండు కర్ణుదెసం గనుంగొని నన్నునిచిపత్తుగాని రమ్మని కరంబు సాఁచి చెయివట్టి తన యరదం బెక్కించుకొని సాత్యకి వేసరి నెక్కి కెలనం జనుదేరం గదలి చని యనుపవచ్చిన కృతవర్మ నుచితప్రకారంబున సస్నేహంబుగా నిలిపి యపుగు నవసరంబునఁ బౌరలోకంబు 1

ఉ. అక్కట వాసుదేవు పను పాదరణంబునఁ జేయరైరి వీ
రెక్కడి బుద్ధిమంతులని నిందును నందును లోకమెల్ల జే
పుక్కన మ్రగ్గుటం దలఁపనొల్ల కపాయము సేసిరట్టె యీ
యుక్కివు లెందునుం గలరె యొప్పరు వో ధృతరాష్ట్ర నందనుల్.2

వ. అని మఱియు ననేకు లనేకప్రకారంబులం బలుకుచు నిరుగెలంకులం జనుచుండఁ బుండరీకాక్షుండు పురంబు నిర్గమించె నట ధృతరాష్ట్రుం డును మగిడి కొలువు కూటంబునకువచ్చి యెప్పటి వారలు పరివేష్టింప నుండి కృష్ణుని వలని మాటలాడుచున్న సమయంబున. 3

తే. అంత నక్కడ నచ్యుతుఁడరిగి యరిగి
యధిక సంప్రీతి దలకొన నర్కతనయు
నాననంబు వీక్షించి యిట్లనియె నెమ్మి
నన్యులెవ్వరు వినకుండ నతని తోడ. 4

సీ. నీవు వృద్ధజనోపసేవివి ధర్మసం
వేదివి తెలియంగ వినుము సిద్ధ
మంత్రబలంబున మార్తాండువరమునఁ
గన్నియ తఱి గొంతి గన్నవాఁడ
వగుటఁ బాండునృపాలు నగ్రసుతుండవు
ధర్మమార్గం బిది ధర్మతనయుఁ
డాదిగాఁ గల తమ్ములందఱు నాచేత
నెఱిఁగి నీ యడుగుల కెఱఁగి సకల

ఆ. పుత్త్ర మిత్త్ర బంధు భూరిసేనా సమ
న్వితము గాఁగఁ గొలిచి నిన్ను రాజ్య
భారవహనమునకుఁ బట్టంబు గట్టను
జ్జ్వలుఁడ వగుదు రమ్ము వారి కడకు. 5

వ. ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు నీవు తొలుత
వెడలునప్పటి మహోత్సవంబునకు యువరాజై యుధిష్ఠిరుండు నీ
రథంబున నుండి నీకు ధవళచామరంబులు వీచు వాయుపుత్త్రుండు
సితచ్ఛత్త్రంబు పట్టు సవ్యసాచి సారథ్యంబు సేయు మఱియుఁ బాంచాల
యాదవ పాండ్యమాత్స్యులు లోనుగాఁగల రాజలోకంబు తోడఁగవలు
నభిమన్యు ప్రభృతి కుమారులు బెరయ సేమెల్లం బలసి పరివేష్టించి
వత్తు మిట్టి మహేంద్రవిభవంబున మహనీయుండవగుచు మహీచక్రం
బేలు మని మఱియును. 6

క. పాంచాల రాజపుత్త్రియు
సంచితముగ నిన్నుఁ బొందు నాఱవ వరుసన్
సంచిత పుణ్యుఁడ వీ వొక
యించుకయును వేఱుసేయ కేతె మ్మెలమిన్. 7

వ. ఇట్లైనఁ గుంతికి సమస్త బంధు మిత్త్రులకుఁ బ్రియంబగు ననిన విని
రహస్యంబుగా రాధేయుండు మాధవున కిట్లనియె. 8

చ. వెడ వెడ యేసుఁ దొల్లి యిది వింటి ననుం గని కుంతి నిర్దయన్
జెడ నదివైచి పోయెఁ గృపఁ జేకొని సూతుఁడు దెచ్చి తాను మున్
గొడుకులఁ గానకున్కిఁ బ్రియకుం దగ నిచ్చినఁ జేఁపెఁ జన్ను ల
ప్పడఁతియు నప్పుడాదిగ శుభస్థితిఁ బెంచెఁ బ్రియత్నశీలయై. 9

క. మూత్రపురీషాదులు దమ
గాత్రములం దింక వారు గారవ మెసఁగం
బుత్త్రుం డని సంవర్ధిత
గాత్రునిఁగాఁ జేసి రింతకాలముఁ గూర్మిన్. 10

క. నేఁ డింక నెఱిఁగి యొరువుల
వాఁడ గదా యనుచు నేను వారిఁ దొఱఁగినం
బోఁడిమి నెడదే మదిఁ గడు
వాడి గలదె నాకు నకట వారిజనాభా! 11

వ. వృద్ధోపసేవనంబును ధర్మసంవేదనంబునుం గలవాఁడ వని నన్ను
నీవ చెప్పితివి రాధయు నతిరథుండును నాకు జాతకర్మాది సమస్త
సంస్కారంబులు నిజకులోచితంబుగా నాచరించి రట్టి తల్లిదండ్రులకుఁ
బుత్త్ర కృత్యంబులు నిర్వర్తింపక వారలం బాసి యేను వచ్చుట
ధర్మం బగునే యని పలికి వెండియు. 12

క. సోదరులుఁ బ్రియులు ననుజులు
నా దెసఁ బెక్కండ్రు వారి నందఱ విడువం
గాదని యూహింపక దా
మోదర నన్నిట్లు పిలుచు టుచితమె చెపుమా? 13

వ. అదియునుం గాక.

ఉ. సూతసుతుండు వీఁ డనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును బెంపును నాఁటికినాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దనయంతటి మానిసిఁ జేసి యుండ నే
నే తగవూఁది యాకురుకులేశ్వరుఁ బాయుదు ముట్టవచ్చినన్. 15

క. నను నయ్యర్జునునకు నెదు
రని పెద్దయు నమ్మియుండు నక్కట దుర్యో
ధనుఁ డా నమ్మిగ వమ్మగఁ
జను నే పాండవులఁ గలయఁ జన నా కనఘా!

ఆ. ఏను నర్జునుండు నెక్కటెక్కటి దల
పడకయున్న నగరె పుడమి జనము
లందు నాదు వచ్చు టతనికి నపకీర్తి
యనిన నాకు వేఱె యడుగ నేల?

క. హిత ముపదేశించితి వీ
వతినిర్మలబుద్ధి వగుట నైనను నిది నా
మతి సొరదు రహస్యము ర
క్షితముగఁ బాటింపు మయ్య చిత్తములోనన్.

వ. అది యేమిటి కంటేని

తే. ధర్మతనయుండు దాను నా తమ్ముఁడగుట
యెఱిఁగె నేనియు సామ్రాజ్య మేల పూను
నట్టి ధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ
వలవదే శాశ్వతంబుగ వసుధ కెల్ల.

క. అనుజులు ఋత్విజులుగ నీ
పని యిటు సేయుమని నీ వుపదేష్ట వుగా
విను కురుకుమార పశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్.

వ. దానం బుణ్యభూమి యగు కురుక్షేత్రంబున మముబోం ట్లెల్లను సద్గతి వడయుదురు గాక యనిన విని వసుదేవనందనుండు సూతనందనున కిట్లనియె.

మ. దయ నా యాడిన మాట గైకొనవు సంతాపంబుఁ దెచ్చుంజుమీ
స్మయ మెట్లుం జది నీకు నర్జునునితో మాత్సర్యమైనం బరా
జయ మొందెన్ స్మృతియొందెఁగాక గెలువన్ శక్యంబె పెక్కండ్ర కెం
తియకాలం బగునట్టె నీ మనము శాంతిం బొందఁగా నేర్చునే! 23

క. గాండీవము కవదొనలు న
ఖండిత దివ్యాస్త్రములు నొగలపై నేనుం
జండభుజబలము నై యు
ద్దండత నరుఁ డరుగ నెడఁ దరమే నీకున్. 24

వ. ఎల్లభంగులం బాండవుల గెల్తురది యట్లుండె నీవుపొ మ్మిప్పుడ పోయి సుయోధనునకు గురు భీష్ములకును మీకుం దోడు వచ్చిన రాజుల కందఱకుం జెప్పు మిమ్మాసంబు సౌమ్యంబై సమశీతోష్ణంబై పుష్పఫలోపేతంబును సమగ్ర ధాన్యంబును సులభయవసేంధనంబును నగుచు నొప్పియున్నది యేడెనిమిది దివసంబులకు నమావాస్య వచ్చునది పుణ్యదినంబు నాఁడు భండనంబు గావలయు ననినఁ గానీ యుండు గమలనాభున కిట్లనియె. 25

క. కలవు నిమిత్త స్వప్నం
బులు కౌరవ పాండవులకుఁ బోటగు దానన్
గెలు పయ్యుధిష్ఠిరునకును
గల దెఱుఁగుదు నీవు సెప్పఁగా నేమిటికిన్. 26

వ. అట్లుగాన కదా యేనందు రానని పలికితి మఱియును.

క. దీనికి మూలము శకునియు
నేనును దుశ్శాసనుండు నింతియ కుంతీ
సూనుల వారలు గలిసిన
రానేరగ వచ్చు నాదు రాజీవాక్షా! 28

వ. ఈ సమరసముద్రంబు గడవ నీఁది నిన్నుం గనియెదఁ గాదేని
నూర్ధ్వలోకంబునం గాంచెద నీ వింక నేమియుం బలుకకుము వని
వినియెద నని కౌఁగిలించుకొనిన నట్లు కాక పొమ్మని విష్ణుండు వీడు
కొలుప రాధేయుండు రథావతరణంబు సేసి గనకరత్నమయంబగు
తన యరదం బెక్కి కరిపురంబున కరిగె నచ్యుతుండును సాత్యకిం
దన రథం బెక్కించుకొని దారుకుంజూచి పదపద పోనిమ్ముపోనిమ్మని
పలికి లలితాటోపకలితుండగుచుఁ జనియె నట్టియెడ విదురుండు
విషాదంబుతోఁ బాండురాజమహిషి పాలికిం జని యిట్లనియె. 29

ఉ. అక్కట కౌరవాన్వయమహార్ణవ మింకెడు నట్లు పుట్టె నిం
దొక్కరుఁడైనఁ గేశవు హితోక్తికి మేకొనఁడయ్యె నర్జునుం
డెక్కటి దాన చాలుఁ దమ నిందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁ బెం
పెక్కిన పాండునందనుల యేడ్తెఱఁ దొల్లియుఁ దారెఱుంగరే? 30

తే. అన్ని వడియును బంధుక్షయంబు సేయ
నొల్ల కెల్లవిధంబుల నుపశమంబ
కోరి రప్పాండవేయులు వారి కిట్టి
దొసఁగు వచ్చునె తులువలతోడఁ బుట్టి. 31

వ. అని వెండియు నివ్విధంబు మాటలఁ బాండవులకుఁ గయ్యంపు టలజడి
యైన వగపు దోఁప నాడుచుం గొండొక పొద్దునిలిచి నిజ వాసంబున
కుం బోయిన యనంతరంబ కుంతి యిట్లని వితర్కించె. 32

మ. తమ వారిన్ సిరికై వధించు టిది సద్ధర్మంబె యక్లేశకృ
త్యమె తాఁ గయ్యము ద్రోణ భీష్మ కృప కర్ణాటోపముల్ మాన్పుట
ల్పములం దీఱునె యందు నర్జుని యుల్లం బెప్పుడుం గ్రోధదీ
ప్తము భీమాదులమీఁదఁ దక్కొరుల కుత్సాహంబు లేదాజికిన్. 33

వ. అని యిత్తెఱంగునఁ బెక్కులు చింతించి తలంచుకొని కర్ణునకుం
బుట్టువు దెలిపి సహోదరస్నేహం బావహించెద నట్లయిన నాహవంబు

వలని కడంక యుడుగకుండునెయని విచారించి యతని పాలికిం బోవ నిశ్చయించి యుచితపరికారంబున వెడలి యతం డనుష్ఠానార్థంబు భాగీరథికిం జనుట విని తత్ప్రదేశంబునకరిగి యతనికి జపకాలంబయి యునికిం జూచి వెనుక వలనం గూర్చుండం గొండొక సేపునకు జపంబు దీఱి గలయం గనుంగొని యమ్మహాదేవిం గాంచి కానీసుండు సంభ్రమ వినయంబులతోడం జేరి సూతగోత్రంబును రాధేయనామంబునుం జెప్పి యభివాదనంబు సేసి నీవు విజయంచేసిన కార్యంబేమి నాకుం జేయంగల పని యెయ్యది యానతిమ్మనినం గుంతి యేకాంతంబుగా నిట్లనియె. 34

సీ. వినుము సూతాన్వయంబున నీవు పుట్టుట

   బొంకేను మా కుంతిభోజు నింట

కన్నియనాడు భాస్కరుని రావించితి

   వర మంత్రబలమున వచ్చి యతడు

సంప్రీతి నొసగంగ జన్మించినాడవు

   నాకు గావున బాండుసందనుండ

వగుదు ధర్మస్థితి నట్టి నీ వితరుల

   గొలువ నేటికి గురుకులవరేణ్య

తే. ధర్మతనయాదులైన నీ తమ్ములకును

ధార్తరాష్ట్రులకును నీవ తగువిభుండ

వేలు మీ లోకమెల్ల నీకేల రాధ

కొడుకితండను తక్కువ కొడుకుగుట్టు. 35

క. అని పలికిన యవసరమున

నినబింబములోన నుండి యిది నిజ మిబ్బం

గిన నెగడ వన్న మేలగు

నను వాక్యము వెడలెం గర్ణుం డాకర్ణింపన్. 36

ఉ. నీ పలుకెంత వోలినను నిర్ణయ మిట్టిద కాని యొండు లే
దీపని మీఁది భారమున నీవిట వచ్చితిగాన పాండవుల్
నేపడిరేనిఁ జంప నఱసేయక చెప్పెద సవ్యసాచిపైఁ
గోపము పెద్ద వాఁడు సమకూరిన బిట్టుఱఁ జంపుదుంజుమీ. 44

ఆ. సవ్యసాచిచేతఁ జచ్చుటయును గీర్తి
కరమ యతఁడు లోనుగాఁగ నేవు
రేను లోనుగాఁగ నేవురుగాని నీ
కొడుకు లార్వురనుట విడువు మింక. 45

చ. అనుటయు నప్డుగొంతి హృదయంబున శోకము నివ్వటిల్ల ని
ట్లను నిది దైవసంఘటన మక్కట యెట్లును దప్పనేర్చునే
యనుపమ సత్య విస్ఫురణ నాడిన మాట మఱాకుమన్న నీ
యనుజుల నల్వురం గడపు మర్జునుఁ జేఁతకు సమ్మతించితిన్. 46

ఆ. అనుచుఁ గౌఁగిలింప నర్కజుం డట్లకా
కని ప్రియంబు మెఱయ వినతుఁడైన
నరిగె సదనమునకు నద్దేవి యతఁడును
జనియె నిజనివాసమునకుఁ బ్రీతి. 47

# 3. తపస్సిద్ధి

## శ్రీనాథ మహాకవి

(హరవిలాసము - చతుర్థాశ్వాసము)

వ. ఈశ్వరాయత్తచిత్త యైన భూధరరాజకన్య మణిభూషణములు విడిచి
వల్కలంబులఁ దాల్చి, పంచాగ్నిమధ్యంబున నిలిచి, యుడుపతికిరణంబు
లును సురతరువలిం డుల్లిన జీర్ణతరుపర్ణంబులును నాహారంబుగాఁ
గొనుచు దుష్కరంబైన తపంబు సేయుచుండ నొక్కనాఁడు. 1

మ. అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతిప్రగల్భుండు ని
రజబంధుప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ డేకాకి వటుండు బ్రాహ్మణుఁడు విశ్రమార్థముం బోలె నా
త్రిజగన్మోహనమూర్తి సన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్. 2

తే. ఇవ్విధంబున నేతెంచి యెదుట నిలిచి
గౌరి నాశీర్వదించె నక్కపటవటుఁడు
కలితకోమలనవకుశగ్రంథియైన
యంగుళీపల్లవంబుల హస్త మెత్తి. 3

వ. పార్వతియు బహుమాన పురస్సరంబుగా నయ్యుర్వీశ్వర వటునకు
నతిథిపూజ యొనర్చిన నతండును గొండరాచూలి సేయు సత్కారం
బంగీకరించి ముహూర్తమాత్రంబు విశ్రమించి మెయివడిచూపునం
జూచి ప్రస్తావనోచితంబుగా నిట్లనియె. 4

సీ. సలిలంబు త్రిషవణ స్నానక్షమం బౌనె
యంభోజపత్త్ర దీర్ఘాయతాక్షి!
కుసుమంబులును నిధ్మకుశపల్లవంబులు

సత్వంబు లన్యోన్య జాతివైరముఁ దక్కి
శాంతి గైకొని యున్నె చంద్రవదన!
యనుదినంబును దేహయాత్ర కాయితమౌనె
నీవారపాకాది పూర్వభోజి!

తే. శక్తి కొలఁదిఁ దపశ్చర్య సంఘటింతె
ఫలముపై నాసనాగ్రహబంధ ముడిగి
తామ్రబింబోష్ఠి ధర్మసాధనములందు
నాద్యమగు సాధనంబు దేహంబ కాదె. 5

క. మగువా! నీ పెంచిన లత
చిగురుపన ముకుళంబు లుల్లసిల్లెనె చెప్పుమా!
పగడపుఁ గెమ్మోవిపయి
న్నగ వుదయించిన విధంబునం బ్రస్ఫుటమై. 6

క. పంకజలోచన! కరద
ర్భాంకురములు మేసినట్టి యపరాధమునన్
రంకుమదపోతకంబునుఁ
జంకింపవుగా తపఃప్రశాంతి వెలితిగాన్. 7

తే. అభ్రవీథీ పరిచ్యుతం బైన యట్టి
యమరతటినీజలప్రవాహమ్ము కంటె
ధరణిధరరాజు నీ చరిత్రంబు కతనఁ
బరమపావనుఁ డయ్యె నో పద్మనయన! 8

వ. సంబంధంబు సాప్తపదీనంబు గావున నింత తడవు నీతోడఁ గదిసి పలుకుచునికిం జేసి యే నాప్తుండఁ గావున నొక్కమాట యడిగెద బ్రాహ్మణజాతిస్వభావ సులభంబైన చాపలంబుఁ జొచ్చి హెచ్చు గుందాడం బనిలేదు. రహస్యంబు గాకుండెనేని జెప్పుము.

సీ. ప్రథమప్రజానాథ పావనకులమునఁ
బ్రభవించి తబల? ప్రపంచసార
సౌందర్యసంపద సడిసన్నదానవ
సశ్వరం బైశ్వర్య నైపుణంబు.
సౌఖ్యంబు నిరవధి సర్వసామగ్రి నీ
యరచేతి భాగ్య మత్యాయతంబు
భాగ్యంబు నీకేమి బ్రాతియైసది మనో
రథ మేమి చెప్పుమా రాజవదన!

తే. దుష్కరంబైన తప మిట్లు తొడరి చేసి
మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చెఁ
జిత్తము విచారమార్గంబుఁ జేరదెచ్చి
తత్త్వముఁ దెలియఁ జెప్పు చూతము మృగాక్షి! 10

వ. పితృగేహంబున నవమానంబు పుట్టదు గదా! పన్నగఫణారత్నంబు మీఁదఁ జెయి సాఁచువాఁడు గలండే! నిండుజవ్వనంబునకుం దగిన భూషణంబులు తొలంగం బెట్టి వార్ధకోచితంబులగు వల్కలంబు లెట్టులు ధరించితివి? దేవలోక నివాసంబున కాసపడె దేని నది వృథాశ్రమంబు! నీ పుట్టినిల్లు దేవభూమియ కదా! తగిన వరునిం గామించి సమాధి వహించితి వేని నదియు నీకుం దగదు! రత్నం బొరునిచే నన్వేషింపఁబడుఁ గాని యొరు నన్వేషించునే? నిట్టూర్పుగాడ్పులచే దుర్లభ జనానురాగంబు నీయందుఁ దేటపడుచున్నది. అట్టి కఠినహృదయుం డెవ్వ డొకో! వాఁ డెవడేని వాని నపేక్షించి నీవు తపంబు సేయుచుఁ గలమాగ్రి పింగళంబగు జటాభారంబు ధరియింపఁ దగ దని యంత నిలువక యక్కపటవటుండు, 11

ఉ. ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్య వెంత కా
లానకు నీకుఁ బెండ్లియ ఫలంబగు నేని విచార మేల స
న్మానముతోడ నన్ను మునిమాన్య వివాహము గమ్ము లెమ్ము కా
దేనిఁ దపంబులోని సగ మిచ్చెద మాను తపోభిమానమున్. 12

వ. అనినం బార్వతి యమ్మిథ్యావటునకుం దన మనోరథం బెఱిఁగింప నొల్లక వయస్యం గనుసన్న సేసిన నచ్చెలికత్తెయు నత్తపోధన కుమారునితో నిట్లనియె. అయ్యా! నీకుఁ గుతూహలంబు గలదేని వినుము. కాలకంఠకఠోర కంఠహుంకారపవివర్తకంబగు పుష్పచాపుని సమ్మోహనాస్త్రం బీకన్య హృదయంబున నాటిన నాఁటంగోలె లలాట చందనధూసరాలకయై తుహిన సంఘాతశిలాతలంబగు జనకు నింట ధృతిం జెందక మహేంద్రప్రభృతులగు దిగీశుల నుజ్జగించి పినాకపాణిం బతిఁగాఁ గోరి తపంబు సేయ సమకట్టె. సబాష్పకంఠస్ఖలితంబు లగు సంగీతాక్షరంబుల విరూపాక్షచరిత్రంబు పాడుచు వనాంతసఖులగు కిన్నెరరాజకన్యకల వగపించుచుఁ ద్రిభాగశేషంబులగు నిశాసమయంబుల నించుకించుక నిద్రించుచుఁ గలఁగాంచి "నీలకంఠ! యెచ్చోటికిం జనియెద" వని యసత్య కంఠార్పితబాహుబంధనయయ్యును విరహవ్యథాదుస్సహంబగు తపోభారంబున భర్గు వశీకరింపం దలంచి యున్నయది యని పల్కిన. 13



చ. వికవిక నవ్వి యక్కపటవిప్రకుమారుఁడు మేలు లెస్స వా
నికి నయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి మీ
సకియ వివాహవేళఁ బురశాసనుపాణిఁ బరిగ్రహించుచో
మొకమున బుస్సుమంచు నహి మ్రెగ్గిన నెట్లు భయంబు చెందునో. 14

సీ. రాయంచ యంచుఁ జీరకు జోకయగుఁ గాక
పచ్చయేనికతోలుఁ బచ్చడంబు
హరిచందనాస్పదంబగు చనుంగవమీఁదఁ
బట్టుఁ జేకొనుఁ గాక భసితధూళి
కమనీయచరణలాక్షారాగరేఖ చే
ముద్రితంబగుఁ గాక రుద్రభూమి
కలితముక్తాఫలగ్రైవేయకంబుతోఁ
దులదూఁగుఁ గాక పెంజిలువపేరు

తే. మనువు లెస్సయి యుండెఁ బో మానవతికి
నివ్విధంబన్న లోకంబు లెల్ల నగరె
యహహా! ముదిగోద నెక్కి భిక్షాటనంబు
సేయఁబోవుట యదియు మేల్చాయ చువ్వె. 15

ఉ. అంధపరంపర న్వెదగవై యభవు న్విని వానితోడి సం
బంధము గోరి నిర్భరతపఃకృశకోమలదేహయష్టివై
బాంధవకోటితోడఁ బెడఁబాసిన నీవును నింద్య వాదు సౌ
గంధిక బంధురేఖ యనఁ, గామిని! మాటలు వేయు నేటికిన్. 16

ఉ. పుట్టు వెఱుంగ నెవ్వరికిఁ బోవదు మూఁడవకన్నుఁ జూచి చే
పట్టఁడు వెట్టివాఁ డయినఁ బ్రాణహరుం డఁట జంతుకోటికిన్
గట్టిన తోలుచీర కలకల్మి ప్రకాశము సేయుచున్న దె
ప్పట్టునఁ జూచినన్ శివుని బైసి యెఱుంగఁగరాదు భామినీ! 17

తే. మాటలేటికిఁ జాలింపుమా తపంబు
హరునిఁ గూర్చి సరోజపత్రాయతాక్షి!
వధ్యుఁ దివియంగఁ బాఁతిన వాఁడికొఱ్ఱు
యూపసత్క్రియ కర్హమై యున్నె చెపుమ. 18

వ. అనిన నక్కపటవటునకు నవ్వధూటి యిట్లనియె. 19

ఉ. చాలు వివాదము ల్పదిగ శంభునిగూరిచి యిట్టి పల్కు లీ
వాలము చేసి పల్కితివి యైనను నౌ విను చంద్రమఃకళా
మౌళిపయి న్వదీయమగు మానస మెంతయుఁ జిక్కె నింక నేఁ
జాలుదు నయ్య యెమ్మెయి భుజంగవిభూషణునిం దొరంగఁగన్. 20

వ. అని జయావిజయలం గనుంగొని యపాంగంబులఁ గెంపు గదుర నీ బ్రహ్మచారి శంకరుని గుఱించి యింకను వంకరకొంకర మాటలాడ నుంకించుచున్నవాఁ డితని మెడవట్టి నెట్టుండని పల్కి కోపావేశంబున. 21

చ. జిలుఁగగు వల్కలాంచలము చెన్నయి చన్నులమీఁద జాఱఁగా
నలుకఁ దుషారశైలసుత యవ్వలిమోమయి నాలుగే న్పదం
బులు సని భ్రూకుటీకుటిలముగ్ధలలాటముఖేందుబింబయై
మలఁగి కనుంగొనెన్ భుజగమండనుఁడైన శశద్విజోత్తమున్. 22

శా. సాక్షాత్కారముఁ జెంది నవ్వుచు గిరీశానుండు ధాత్రీధరా
ధ్యక్షాపత్యముఁ బ్రేమనిర్భరకటాక్షాలోకనప్రౌఢిమన్
వీక్షించెన్ దరశాక్షియు న్మనమున వ్రీడాప్రమోదక్షమా
దాక్షిణ్యంబులు సందడింప నిలిచెం దత్సన్నిధానంబునన్. 23

చ. అనవగు నీ తపమ్మునకు నమ్ముడువోయితి నేలుకొమ్ము నీ
వరవుడ నంచు శూలి ప్రియవాక్యములం దగ గారవింపఁగా
ధరణిధరేంద్ర నందన యుదగ్రతపోమహనీయవేదనా
భరమఖిలంబు వీడ్కొలిపె భావమునం బరితోష మందుచున్. 24

# 4. వామన చరిత్రము

## బమ్మెర పోతన

(శ్రీమదాంధ్ర మహాభాగవతము - అష్టమ స్కంధము)

క. హరిహరి! సిరి యురమునఁ గల
హరి హరిహయుకొఱకు దనుజు నడుగన్ జనియెన్
బరహితరత మతియుతులగు
దొరలకు నడుగుటలు నొదలి తొడవులు పుడమిన్. 1

వ. ఇట్లు చని చని నర్మద కుత్తరతటంబునందు. 2

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధా జల్పన్నిశాటంబు, ను
ద్దండాహూత మునీభ్య విభ్య దమృతాంధ స్సిద్ధకూటంబు, వే
దండాశ్వ ధ్వజినీ కవాటము, మహోద్య ద్ధూమసంఛన్న మా
ర్తాండస్యందన ఘోటమున్, బలి మఖాంతర్వేదికా వాటమున్. 3

వ. కని, దానవేంద్రుని హయమేధవాటిక దాటి, బలి సభామంటపంబుఁ
జొచ్చి.

ఉ. స్వస్తి జగత్త్రయీ భువన శాసనకర్తకు, హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు నుదారపద వ్యవహర్తకున్, మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్. 5

వ. అని దీవించినం గరచరణాద్యవయవంబులు ధరియించిన వేదరాశియుం బోలె నొప్పుచు, మాయావాదన పటుండు నగు వటునిం గని, బలి నమస్కరించి, తగిన గద్దియ నునిచి, పాదంబులు దుడిచి, కొమరుని తన ప్రాణవల్లభ పసిండికలశంబున నుదకంబులు వోయ, వడుగు చరణంబులు గడిగి, తడి యొత్తి. 6

వటుని పాదశౌచవారి శిరంబునఁ
బరమభద్రమనుచు బలి వహించె
నే జలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ
దేవుఁ డుద్వహించె ధృతి శిరమున. 7

అనంతరం బయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 8

వడుగా! యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్యది
య్యేఁదకున్ నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్
గడు ధన్యాత్ముఁడనైతి నీ మఖము యోగ్యంబయ్యె నా కోరికల్
గడతేఱెన్ సుహుతంబు లయ్యె శిఖులుం గల్యాణ మిక్కాలమున్. 9

వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా? 10

అని ధర్మయుక్తంబుగాఁ బలికిన, వైరోచని వచనంబులు విని, సంతోషించి, యీశ్వరుం డిట్లనియె. 11

ఇది నాకు నెల వని యే రీతిఁ బలుకుదు
నొక చోటనక నిండియుండ నేర్తు
నెవ్వని వాఁడసం చేమని పలుకుదు
నా యంతవాడనై నడువ నేర్తు
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవ నేర్తు
నది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ
నేరుపు లన్నియు నేన నేర్తు

ఆ. నొరులు గాట నాకు నొరులకు నే నొదు
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నా యుంకి
మనుజులందుఁ దఱచుఁ జొచ్చి యుండు. 12

వ. అది యట్లుండనిమ్ము. 13

క. ఏలితివి మూఁడు జగములు
దోలితి వింద్రాది సురులఁ దొల్లిటి వారిం
బోలితివి దానగుణములఁ
జాలితి వీ రాక్షసులను సంరక్షింపన్. 14

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల
మేర యిమ్ము సొమ్ము మేర యొల్లఁ
గోర్కెదీర బ్రహ్మకూకటి ముట్టెద
దానకుతుకసాంద్ర! దానవేంద్ర! 15

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె. 16

మ. వసుధాఖండము వేడితో గజములన్ వాంఛించితో వాజులన్
వెస నూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీ వడుగ నీ భాగ్యంబు లీ పాటిగా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీ నేర్చునే 17

వ. అనిన మొగంబునం జిఱునగవు మొలక లొత్త, గృహమేధికి మేధావి
యిట్లనియె. 18

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూము లెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచిత కర్మ మెక్కడ మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటయె బ్రహ్మాండంబు నా పాలికిన్. 19

ఆ. నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట
తగవు గాదు నాకుఁ దగిన కొలఁది
యేను వేడుకొనిన యీ పద త్రయమును
చాల దనక యిమ్ము చాలు చాలు. 20

వ. ఇట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీశ్వరుం డుర్వీదానంబు సేయం
దలంచి, కరకలిత సలిల కమలుండైన యవ్విశరణగుణముఖరునిం
గని, నిజవిచారయుక్త దనుజరాజ్యచక్రుం డగు శుక్రుం డిట్లనియె.21

సీ. దనుజేంద్ర! యీతడు ధరణీసురుఁడు గాఁడు
దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితి గర్భంబున
గశ్యపు సూనుఁడై కలిగె నకట
యెఱుగ కీతని కోర్కె నిచ్చెద నంటివి
దైత్యసంతతి కుపద్రవము వచ్చు
సిరి లక్ష్మి తేజంబు నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చును వాసవునకు

ఆ. మొనసి జగము లెల్ల మూఁడు పాదంబుల
నఖిలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వధనము విష్ణు సంతర్పణము చేసి
బడుగు పగిది నెట్లు బ్రతికె దీవు. 22

మ. కులమున్ రాజ్యము తేజమున్ నిలుపు మీ కుబ్జుండు విశ్వంభరుం
డలతిం బోడు త్రివిక్రమ స్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండమున్
గలఁడే మాన్ప నొకండు నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్
వలదీ దానము గీనమున్ బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా! 23

వ. అని యిట్లు హితంబు వలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీ
లిత లోచనుండై యశస్వి యిట్లనియె. 24

సీ. నిజ మానతిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థధర్మంబు నిదియ
యర్థంబు గామంబు యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థలోభంబున నర్థిఁ బొమ్మను బెట్లు
పలికి రేపను కంటెఁ బాప మెద్ది
యెట్టి దుష్కర్ముని నే భరించెదఁగాని
సత్యహీనుని మోవఁ జాల ననుచుఁ

తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరమం దడ్గు దిరుగక చచ్చు కంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరగుకంటె
మానధనులకు ధర్మంబు మఱియుఁ గలదె. 25

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వా రేరీ సిరి మూటగట్టుకొని పోవం జాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా! 26

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట, మీఁదై నాకరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే. 27

మ. నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నోఁ
దిరుగ న్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్. 28

క. మేరువు తలక్రిం దైనను
బారావారంబు లింకఁబాఱిన లోలో
ధారుణి రజమైపోయినఁ
దారాఢ్యము బద్ధమైనఁ దప్పక యిత్తున్. 29

ఆ. బ్రతుకవచ్చుఁ గాక బహుబంధనములైన
వచ్చుఁ గాక లేమి వచ్చుఁ గాక
జీవధనములైన జెడుఁగాక పడుఁగాక
మాట దిరుగ లేరు మానధనులు. 30

క. రమ్మా మాణవకోత్తమ
లెమ్మా నీ వాంఛితంబు లేదన కిత్తున్
దెమ్మా యడుగుల నిటు రా
నిమ్మా కడుగంగవలయు నేటికిఁ దడయన్. 31

మ. బలిదైత్యేంద్రి కరద్వయా కృత జలప్రక్షాళన వ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాచె యోగిసుమన స్సంప్రార్థిత శ్రీదమున్
గలితానమ్ర రమాలలాట పదవీ కస్తూరికా శాదమున్
నలినామోదము రత్ననూపురిత నానావేదముం బాదమున్. 32

క. సురలోక సముద్ధరణము
నిరతశ్రీ కరుణ మఖిల నిగమాంతాలం
కరణము భవహరణము శ్రీ
హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్. 33

వ. ఇట్లు ధరణీసుర దక్షిణచరణ ప్రక్షాళనంబు చేసి, వామపాదంబు గడిగి తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని, వార్చి, దేశకాలాది పరిగణనంబు చేసి. 34

శా. 'విప్రాయ ప్రకట వ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్య విదే త్రిపాద ధరణీం దాస్యామి' యంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాచి పూజించె బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్. 35

క. క్షితి దానమిచ్చు నతఁడును
నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్. 36

వ. ఇట్లు పరిగ్రహణంబు చేసి. 37

శా. ఇంతింతై వటుఁ డింతయై మఱియు దా నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాభ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై. 38

మ. రవిబింబం బుపమింపఁ బాత్ర మగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్వస్త్రమై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండము న్నిండుచోన్. 39

మ. ఒక పాదంబున భూమిఁ గప్పి దివి వేఱొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీది జగంబు లెల్లఁ దొడి నొండొంటన్ విలంఘించి ప
ట్టక బ్రహ్మాండకటాహముం బగిలి వేండ్రంబై పగుల్ గాస రా
వొకఁడై వాగ్దృగలభ్యుఁడై హరివిభుం డొప్పారె విశ్వాకృతిన్. 40

# 5. చిత్రాంగద వివాహము

## చేమకూర వేంకటకవి

(విజయ విలాసము - ద్వితీయాశ్వాసము)

మ. ఒక భూమీదివిజుండు చోరహృత ధేనూత్తంసుఁడై వేఁడికొం
టకుఁ దా ధర్మజు కేళిమందిరము దండం బోయి కోదండ సా
యకము ల్దెచ్చుటఁ బూర్వక్లప్తసమయన్యాయానుకూలంబుగా
నొకయేఁ డుర్విప్రదక్షిణం బరుగు నుద్యోగంబు వాటిల్లినన్. 1

వ. అర్జునుండు తనదు పురోహితుని తమ్ముడును సకలధర్మవిశారదుడు
నగు విశారదుడు వెంట రాగా, నన్నకు మ్రొక్కి, గంగకుం జని
క్రుంకులిడి పాతాళంబున నాగకన్య యగు నులూచిం బెండ్లియాడి
కొంతకాలము సుఖం బుండి యటనుండి పయనంబై తీర్థయాత్రలు
సేవించుచు శ్రీశైల కాంచీపురాది క్షేత్రంబులు దర్శించి, కావేరి నుత్త
రించి, పాండ్యమహీమండలాఖండలుండగు మలయధ్వజు డేలు మణి
పురంబుఁ జేరంబోవు సమయంబున. 2

సీ. మంగళస్నాన సంభ్రమముఁ దెల్పెడి రీతిఁ
గెలనఁ గెందామర కొలనఁ దేలి
ధవళముల్ విని చొక్కు హవణుఁ దెల్పెడు లీల
హాళిఁ గోయిల పల్కు లాలకించి
తలఁబ్రాలు వోయు బిత్తరముఁ దెల్పెడు చాయఁ
గ్రొన్ననల్ దోయిళ్ల కొలఁది నొసఁగి
బువ్వాన భుజియించు పొల్పుఁ దెల్పెడి జాడ
గుమిఁ గూడికొని మరందములు గ్రోలి

తే. తనకుఁ దోడ్తోడ నగు పెండ్లి గనఁబడంగఁ
జేయు నటువలె గారాబుఁ జెలులఁ గూడి
వనవిహారంబు గావించి చనెడు పాండ్య
రాజసుతఁ జూచి యప్పాండు రాజసుతుఁడు. 3

తే. ఈ వెలంది యొకల్ పైఁడిలో వెలంది
యీ నెలంత లలాటంబు లే నెలంత
యీ సుపాణి రవ్వశేణియే సుపాణి
యీ బిడారు మృగీమవశ్రీ బిడారు. 4

క. వాతెఱకు సమృతమే తుల;
మేతుల కింపుల పిసాళి మిసిమిసికిఁ గ్రొమ్మిం
చే తుల, చేతుల రజ్జము
లే తుల; లేతుల వెలఁదు లీ చెలి తులయే? 5

క. అనుచును మనమునఁ గోర్కులు
కొనసాగఁగ నీ నృపాలకునితో నెయ్యం
బొనరింప వలయు నేఁడి
వ్వని నుండుద మనుచుఁ జొచ్చి వచ్చుచు నుండన్. 6

క. ఒక మెట్టు తరణి డిగ్గిన
నొక మెట్టు శశాంకు డెక్కు; నుర్వీస్థలిలో
నొకఁడు దిగుడైన నవ్వల
నొక రా జంతంతకున్ మహోన్నతిఁ గనఁడే ! 7

క, విధుచకచరలును, బుంద్రే
క్షు ధనుర్ధరు సంపనెకలు, శుక పిక శారీ
మధులిట్టులు మలయానిల
మధులిట్టులు తనదు దైర్య మహిమఁ గలంపన్. 8

చ. 'చందనగంధి నెన్నుదురు చందురులో సగఁబాలు, బాలము
ద్దుం దెలిచూపు లంగజుని తూపులలోపల మేల్తరంబు, లిం
దిందిరవేణి మేని యెలతేనియలో వికరంపుఁదేట, యే
మందము? మందయాన మొగమందము మీఱు సవారవించముస్. 9

ఈ కరణిఁ దలఁచుచు నా
శీకనిభానన నెదన్ నిలిపి రే గడపెన్,
లే కెటుల నిద్ర వచ్చున్
రే కగు నయ్యువిద నెదను నిల్పిన దాఁకన్. 10

అపుడు నృపుఁడు ప్రఫుల్ల నవాంబుజ ప్ర
సన్నముఖుఁ డయి 'మలయధ్వజక్షితీశ
కమలహితునకు మామకాగమనవార్తఁ
దెలుపు' మనుచు విశారదుఁ బిలిచి పనిచె. 11

పనిచిన నేఁగి యాతఁడు నృపాలుని మంత్రి ముఖాంతరంబునం
గనుఁగొని 'యంత్రమత్స్యము జగం బెఱుఁగన్ భుజశక్తి నేసి యు
వ్వనిఁ గయికొన్న యర్జునుఁడు వచ్చినవాఁ డిదె తీర్థయాత్రగా
జనవర!' యంచు విన్నపము సల్ప ససంభ్రమ చిత్తుఁడై తగన్. 12

ఎదురుగ వచ్చి పాండ్యధరణీశ్వరుఁ డర్జును గాంచి 'నేఁడుగా
సుదినము: మీరు రాఁ గలుగు శోభన మెన్నఁడు గల్గుఁ, బ్రోలికిం
బదుఁ' డని యిద్దఱుం దొఱసి భద్రగజంబుల నెక్కి వచ్చి రిం
పొదవ హాళాహళిం గడకు నెత్తెడు పౌఁజుల దిక్కు సూచుచున్. 13

నెట్టుకొని నరుని గనుచోఁ
బట్టణమునఁ గల సమస్తభామల కహహా!
యెట్టి విచిత్రమొ, మనసునఁ
బుట్టినవాఁ డపుడు మననుఁ బుట్టించెఁ జుమీ! 14

'చక్కఁదనంబు రూపునఁ బొసంగుటె కాదు; గుణంబు లందునుం
జక్కఁదనంబు గల్గు నెఱజాణ, జగంబుల నీడు లేని నా
చక్కని కూఁతునుం దొరయ జాలిన వాఁ, డితఁ డల్లుఁ డైనగా
మిక్కిలి కీర్తి గల్గు' నని మెచ్చు మనంబున రాజు సారెకున్. 15

అనంతరంబ. 16

క. సుత్రామ విభుఁడు పాండ్య ధ
రిత్రీ విభుఁ డానతీయ, శృంగారకళా
చిత్రాంగదయుత యగు నా
చిత్రాంగదఁ బెండ్లికూఁతుఁ జేసిరి కాంతల్. 17

క. హరిపతి నడుమున కోడెన్
గరువపు నడుమునకు నోడె గజపతి; యిఁక నీ
నరపతి లోనగు టరుదే
వరవర్ణిని మెఱుఁగు వాఁడి వాల్చూపులకున్. 18

ఉ. చక్కని కన్యకామణికిఁ జక్కనివాఁ డగు ప్రాణనాథుఁడుం
జక్కని శోభనాంగునకుఁ జక్కని యింతియుఁ గల్గు టబ్బురం
బెక్కడ; నిట్టులుండవలదే, రతిదేవికి సాటివచ్చుఁ బో
యిక్కనకాంగి, మన్మథున కీ డితఁ డీడిత రూపసంపదన్. 19

క. అని రూపకళల జూపఱు
గొనియాడగఁ బేరటాండ్రు గొందఱు తెరవం
చినఁ జూచె నతివ నర్జునుఁ
డనురాగాంబుధి తటాన నటఁ దెరయెత్తన్. 20

చ. చిలుకలకల్కి కన్గొనియెఁ జేరలఁ గొల్వఁగ రాని కన్నులున్,
మొలక మెఱుంగు నీలముల ముద్దులుగాఱు నొయారి మీసముల్,
గలకల నవ్వు చక్కని మొగంబు, వెడంద యురంబు, సింగమున్
గలఁచు రువాణపుంగవును గల్గిన యా కురువీరపుంగవున్. 21

క. అంగజరాజ్యం బేలుట
కుం గట్టిన తోరణంబొకో యన, నతఁ డా
శృంగారవతికిఁ గట్టెన్
మంగళసూత్రంబు చతురిమం గళసీమన్. 22

అనురక్తిం దలఁబ్రాలు వోసె విజయుం డా వేళ బంగారుకుం
డన రంగా నలిపీలవేణిపయి ముత్యాల్ దోయిటన్ ముంచి చ
య్యనఁ బాల్పొంగిన కైవడిన్ సిరులు పెంపై పూలు రేకెత్తి న
ట్లనె వర్ధిల్లు మటన్న దీవనల కెల్లం దావలంబై తగన్. 23

తామ్రపర్ణీనదీతీర ధరణి నేలు
దొరతనముఁ దెల్పఁగా రాశిదొరలఁ బోసె
ముదిత చేతులఁ దలఁబ్రాలు ముత్తియములు
ముదిత చేతస్కులై సభాసదులు వొగడ. 24

# 6. జననింద

## కంకంటి పాపరాజు

(ఉత్తర రామాయణము - షష్ఠాశ్వాసము)

ఉ. 'ఇంతకుఁ బూనివచ్చి వచియింపక పోదునె! విన్ము తల్లి దు
శ్చింతులు దైత్యుచేఁబడిన సీతను గ్రమ్మఱ నేలుచున్నవాఁ
డెంత విమోహి రాముఁ డని యెగ్గులు వల్కఁగ, నాలకించి, భూ
కాంతుఁడు నిందఁ జెంది, నిను గానలలోపల డించి రమ్మనెన్.

క. క్షుల్లకజన దుష్టవచో
ఖల్లకదంబముల హృదయపద్మ మగల భూ
వల్లభుఁ డోరిచె భవదా
యల్లకథర మేమి వినియె దమ్మరో? యింకన్.

చ. మునులు మహాతపోనిధు లమోఘదయాంబుధు లాశ్రయించు కా
ననములు చేరి, నీ విఁక దినమ్ములు ద్రోయఁ గదమ్మ యంచు,
యునికి కనర్హమైనయెడ లొప్ప గణింపఁగ నొప్పె నాల్కఁ, నీ
యనదతనంబు సైఁచె మది యమ్మరో! యెంతటి కైతిఁజూడుమా.

చ. జనపతి లోకనిందఁ బడజాలక, నిన్ వనిఁ ద్రోయు మన్నచో
విని, సహియించి, కానలకు వేగమునన్ గొనితెచ్చి, నిల్వఁగాఁ
జనునెడ లుగ్గడించి, ధృతి సంపదఁ బొంపిరి వోవుచున్నవాఁ
డను సనువంటి మూర్ఖు నకటా! విధి యే గతి సృష్టి చేసెనో?

ఉ. అంచిత వామలూరుజ వనాంతర భూముల నిన్ను డించి, ర
మ్మంచు రఘూద్వహుం డనిచె, నక్కట! యెక్కడ నిల్చి యెట్లు
గించెద వమ్మ! యెవ్వరు సఖీజను లయ్యెదరమ్మ? యేమి యూ
హించి దినమ్ము లింకఁ గ్రమియించెద వమ్మ? పతివ్రతామణీ!

ఉ. నీ విమల ప్రభావమును నీ వినయాదిక సద్గుణంబులున్
దేవుఁ డెఱింగియుండియును నిందలకుం బయిలోడి, యో జగ
త్పావని! నీవు గోరిన నెపంబున నిచ్చటి కంపినాఁడు గా
కీ విరహాబ్ధి నే కరణి నీదఁగలాఁ డతఁ డింక మీఁదటన్? 6

ఉ. దాయలకైన నిట్టి వెత దార్కొన నేగతిఁ జూడవచ్చు? ని
న్నీయటవీస్థలిన్ విడిచి యే నెటు లేగుదు? నన్ను నేల భూ
నాయకుఁ డిట్టి బెట్టిద మొనర్పఁగఁ బొమ్మనె? యెద్దియైననుం
జేయఁగ నోపఁ డీ కఠినచిత్తుఁ డటంచు నెఱింగి పంపెనో! 7

సీ. మితిలేని యీ మిడిమేలంపు మెకములు
సకియల బలగమే జనని! నీకు
పరికింపరాని యీ బలుమలల్ నవరత్న
మయ చంద్రశాలలే మాత! నీకు
కడుభీతి ముంచు నీ గహనముల్ విహరింపఁ
దగిన పూదోఁటలే తల్లి! నీకు
ఘోరనక్రభుజంగకోటితో మలయు నీ
హ్రదములు కొలఁకులే యంబ! నీకు

గీ. బంధురములైన యీ మహాప్రస్తరంబు
లిందుమణి వేదికలె జనయిత్రి! నీకు
కటకటా! యొంటి నిచ్చోట నెటుల నిలిచె
దమ్మ? నీ యునికి కే మందు నమ్మ! నేను 8

మ. 'జననీ! నీవు మహాపతివ్రతవు, నీ సౌశీల్య మిల్లాండ్ర కె
ల్లను మేల్బంతి, రఘూద్వహాంఘ్రియుగళీ లగ్నాత్మవై యుండుమా'
యని, నే నెవ్వఁడ విన్నవింప? పతిఁ బాయంజేసి, నిన్నొంటి డిం
చిన పాపాత్ముఁడ, నూరి కేగుమనుచున్ నెల్విచ్చెదే" నావుడున్. 9

వ. పడి, చేష్పడి బడిబడిం బొడము బడలికల నొడ లెఱుంగక రెండు
గడియ లుండి, కొండొక దెలిసి, వెండియు నలసి, యవశయై, దీన
దశం బొరసియు, నా కృశాంగి మరలఁ గన్నుఁ దామరలు విచ్చి,
విచ్చలవిడ వెడలెడి యశ్రుజలధారాప్రవాహంబులు చెక్కుటద్దంబులపై
జాలువాఱి, జాఱువా మెఱుంగు పయ్యెద చెఱంగుమీఁదికి దిగ జాఱి,
మెండుకొను నిట్టూర్పు సెగలందగిలి చిఱువాతెఱ తుకతుక నుడుక,
నుడుగణంబుల బెడఁగు నదగఁ ద్రొక్కు జేచ్చక్కి దెరలఁ, వరశతర
చికుర నికరంబు లలికఫలకంబునఁ జెరలాడఁ దుఱిమిన విరులసరులతో
నొఱలిన కొప్పు పెన్నెఱు లంసభాగంబులం బొరలిపడ, జడుపుఁ
జెమ్మటలం గ్రమ్ముకొని నెమ్మేను గడగడ వడంకఁ, గడంక దక్కి
చిన్ని మొగంబు విన్నఁదనంబున కిమ్ముఁ జూపఁ బరితాపదవానలంబునఁ
బడి పురపురం బొక్కుచుఁ, దాల్మి దూలి స్రుక్కుచు, లేచి కూర్చుండి,
శోకరసం బాకారంబు దాల్చిన చందంబునఁ. జిత్రంబు గాత్రంబుఁ
గై కొన్న చెన్నున, సాధ్వసంబు సాధ్వియైన కరణిఁ, గరుణంబు కర
ణంబు లొందిన తెరంగున, నూరక వెక్కివెక్కి యేడ్చుచు, నేడుపు
విడిచి మౌనంబు పూనుచు, మౌనంబు మాని తనలోఁ దానె నగుచు,
నగ వుడిగి తల యూఁచుచు దలయూఁచుట విడిచి ముక్కుపై వేలుగీలు
కొలుపుచు, జాలిగొని హాహాకారంబు సలుపుచుఁ దలఁపని తలఁపు
లివిగో చూచితే? లక్ష్మణా! యని యతని దిక్కు చూడ్కులు నిగిడించి
యిట్లనియె. 10

చ. అడలుకు మన్న! నీకు వసుధాధిపు నానతి దాఁట వచ్చునే?
యిడుమలఁ జెందు మంచు విధి యీధర నన్ను సృజించి యుండఁగాఁ
గడవఁగ నెవ్వరోపుదురు? కానల కేగిన నాఁడె యాపదల్
గడచితి నంచు నుంటి, నెఱుఁగం దుది నిట్లగు నంచు నా మదిన్. 11

చ. ఎడపక పూర్వజన్మముల నే మిథునంబులఁ బాయఁ జేసి, వా
రడలగ నవ్వుచుండితినొ? యా యఘ మూరక పోనె? నాఁడు కా
రడవుల రామపాదజలజాప్తి వసించితి, నేఁడు నాథుపాం
దెడసి యనాథనై యిచట నే గతి మేన ధరింతుఁ బ్రాణముల్? 12

ఆ. ఏను సాధ్వి ననుచు, నెల్ల వారలు నన్ను
సన్నుతింతు రనుచు సంతసింతుఁ
గాని, సదుమ నిట్టి కటికనిందలు పుట్టి,
యడవిఁ ద్రోచు రాముఁ డనుచు నెఱుఁగ. 13

చ. కటకట! లక్ష్మణా పిడుగుకంటెను బెట్టిదమైన మాట నేఁ
డిటు వినియుండియున్ బగుల దింతలునింతలు గాదు గుండె యె
ప్పటివలె నున్న దీ కటికభావముతో ననువుల్ ధరించి, యి
య్యటవినె యింక నే పలన నాపద లొందఁగ నున్న దాననో? 14

చ. కళవళమంది తెల్పితివొ? కాక పరాకునఁ దప్పు వింటివో?
కలనయినన్ రఘూద్వహుఁడు కానలలో ననుఁ ద్రోయఁ బంచునే?
తెలిసి గణింపు లక్ష్మణ! మతిభ్రమమైనదొ! హా! సహింపు మి
ప్పలుకు లెఱుంగ కంటి, వెతఁ బాటిలె నీ కొక భ్రాంతియున్నదే? 15

ఉ. ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును, నన్నిఁక రామచంద్రుఁడున్
గన్నులఁ జూడఁ గల్గదొకొ? కల్గకయుండినఁ బ్రాణ మేల పో
దన్న! రఘుప్రవీరు చెవులారఁగ నింతయుఁ దెల్పు, నాదు మే
నున్నది చెంత గంగమడు గున్నది యైనటు లయ్యెదుం దుదిన్. 16

చ. పతి మది నెంచె నేమొ తనుఁ బాసి యశోకవనంబులోపలన్
బ్రతుకదె పెక్కునా ళ్లనుచుఁ గ్రమ్మఱఁ దాఁ జనుదెంచు శత్రునిన్
హతునిఁగఁ జేయు నేలు నను నాసఁ గదా బ్రతికించె నాఁటి కా
గతి నిఁక నేమి యాసఁగొని కాయము నిల్పుదుఁ దెల్పు మిన్నియున్ 17

చ. ఎఱుఁగని మూఢు లాడుకొను నెగ్గులకున్ భయమంది, యప్పుడే
కఱకుమనంబుతో విభుడు కాననసీమకు బంచె గాక య
త్తఱి నొకసారి నన్ బిలిచి తెల్పి మనోవ్యథ తీర్చి విన్న నే
మఱు నని పంప డయ్యె నభిమానము గూర్మియు నెందు బోయెనో 18

క.	ఆ కరుణ యా ప్రసన్నత
యా కూరిమి యా ప్రియోక్తి యా గారవమున్
గాకుత్స్థుఁడు మఱచెఁ గదా?
యాకస్మికముగ జనించు నపవాదమునన్.

శా.	ఆకర్ణాయతనేత్రమై మణిమయోద్యత్కుండలద్వంద్వ శో
భాకీర్ణాంచితమై గల్లమై సురదనంబై, సుందర భ్రూయుతం
బై, కమ్రస్మిత చంద్రికా విలసితంబై యొప్పు శ్రీ రాముమో
మీ కాయమ్మనఁ జూచు భాగ్య మిఁక లేదేమో? సుమిత్రాత్మజా!20

సీ.	అవని నయోనిజ నయి పుట్టి మిథిలేంద్రు
వీట నేఁ బెరిఁగిన విధము వినరా!
యంగరాగము లిచ్చి యనసూయమొదలైన
సతులెంచుకున్నది చాల వినరా?
యా లంకలోఁ దొల్లి త్రైలోక్యము నుతింప
వహ్ని నేఁ జొచ్చిన వార్త వినరా?
యీ సీత నిర్దోషి యేలుకొమ్మని రాము
బ్రహ్మాదు లపు డన్న పలుకు వినరా?

ఆ.	వినియుఁ గనియుఁ బ్రజలు నను నిందసేయుట
యంత మాత్రమునకె యధిపుఁ డులికి
యింత తెగువసేయ నిచ్చగించుట నా య
భాగ్య మింతె, యొకరిఁ బల్క నేల?

చ.	'వనమునకేల వచ్చితివి? వల్లభునిం బెడఁ బాసి యొంటిగా'
నని మునిపత్ను లెల్ల గుమియై యడుగన్, ధృతి మాలి, వారి కే
మని వివరింతు? నింక విపదంబుధి నే కరణిం దరింతు? నే
యనువున నీ ప్రతీక్షణ మహాయుగముల్ గ్రమియింతు? లక్ష్మణా!

వ. అని పెక్కువగల నమ్మగువ వగలం బొగిలి మగని తెగువకుఁ బరితపించియు, నించుక తగవుఁ దలంచి, తెగువ వహించి, బహిర్లిఖిత చిత్రింబు కొమరొందియున్న యమ్మఅందితో మఱియు నిట్లనియె. 23

చ. వగపునఁ దోఁప నన్నియు నవారణఁ బల్కితిఁ గాక, భర్తకున్
జగ దపవాదముం గడువ శక్యమె' నేను వియోగమగ్నతన్
దెగువకుఁ జొచ్చి రాము జననిందితుఁ జేయుదునే? తదాజ్ఞ యె
ల్లగతులఁబూని, కానల మెలంగుదు, మేను గలంత కాలమున్. 24

సీ. అన్న! లక్ష్మణ యింక నాలస్య మేటికిఁ?
జను మయోధ్యాపురంబునకు నీవు,
ముమ్వురత్తలకును మ్రొక్కితినని తెల్పు
మచటిబంధుల నెల్ల నడిగితి నను,
మతి కృపాలునకు రామావనీంద్రునకు నా
మ్రొక్కుగా నతిభక్తి మ్రొక్కు మీవు
తన యాజ్ఞఁ దలఁదాల్చి జననింద తనుఁ జెంద
నీక కానలఁ జరియింతు ననుము

తే. భూజనుల బాంధవుల లెస్స బ్రోవు మనుము
తలఁప నా కేడుగడయును దానె యనుము
భావ మెప్పుడుఁ దన మూర్తిఁ బాయ దనుము
నెమ్మి యొకయింత నా మీఁద నిల్పు మనుము. 25

తే. పోయిరమ్మ శుభమ్ములు పొందు నిన్ను
నన్ను మఱవక యుండు మా యన్న యనుచుఁ
గన్నుఁగవ నశ్రుధారలు గ్రమ్మకొనఁగ,
నన్నెలంతుక దీనయై యచలుచున్న. 26

క. చనఁ గాళ్ల రాక చన కేఁడఁ
జన దని ధేనువును బాయఁజాలని వత్సం
బునుబోలి జాలిఁగొని యో
జననీ! జననాథుఁ గొల్వఁ జనుదునె యనుచున్.

ఉ. అల్లన మ్రొక్కి, కాళ్ల వడఁకాడఁ బ్రదక్షిణ మాచరించి, మే
నెల్లఁ జలింప, హోరు మని యేడ్చుచుఁ బెద్దయెలుంగుతోడ, మా
తల్లిని డించిపోయెదను దాపసకామినులార! కూర్మిసం
ధిల్లఁగఁ బ్రోవరే యనుచు దీనత లక్ష్మణుఁ డేగె నయ్యెడన్.

క. కాంతారత్నం బిట న
క్కాంతారమునందు వగవఁగా, ఫలముల క
చ్చెంతఁ జరియించు మునిసుతు
లంతయుఁ గని వచ్చి జూచి యరుదంది వెసన్.

శా. ఆ వాల్మీకుల చెంత కేగి నతులై యయ్యా! విముక్తాబ్జయౌ
శ్రీవామాక్షియొ? ధాత్రికిం దిగిన జేజేరాజుదేవేరియో
నా వెల్గొందు లతాంగి యొర్తు వనిలోనన్ దీనయై బెట్టువా
పోవం గన్గొని, తెల్ప వచ్చితిమి, యప్పాబోఁడిఁ గావం దగున్.

వ. అని విన్నవింప నమ్మునిశేఖరుండు నాంతరదృష్టి నా యమ్మ రఘు
రాము దేవేరియని యెఱింగి యర్ఘ్యపాత్రంగొని శిష్యులు వెంటరాఁజని

ఆ. అనునయించి యర్ఘ్య మాయమ కిప్పించి
మౌనిమణి నిజాశ్రమంబునకును
గూర్మితోడఁ దోడుకొనిపోయె, నిర్వ్యాజ
బంధు జనులుగారె బ్రహ్మమునులు

# 1. భీమ ప్రతిజ్ఞ

## నన్నయభట్టు

### (ఆంధ్ర మహా భారతము - సభాపర్వము - ద్వితీయాశ్వాసము)

సంస్కృతమున వ్యాసమహర్షి రచించిన మహాభారతమును కవిత్రియ మని ప్రసిద్ధిచెందిన నన్నయభట్టు, తిక్కన, ఎఱ్ఱాప్రెగడలు ఆంధ్రీకరించిరి. అదియే శ్రీమదాంధ్ర మహాభారతము. ఇది తెలుగు భాషలో లభించిన తొలి గ్రంథము. భారతమునందు పదునెనిమిది పర్వములుగలవు. దానిలో నన్నయ ఆది సభాపర్వములను, అరణ్యపర్వము చతుర్థాశ్వాసమున 142 వ పద్యము వఱకు వ్రాసి చనిపోగా మిగిలిన అరణ్యపర్వమును ఎఱ్ఱాప్రెగడయు, విరాట పర్వమునుండి చివర వరకు తిక్కన సోమయాజియు వ్రాసిరి.

క్రీ. శ. 11వ శతాబ్ది (1022 నుండి 1063) లో రాజమహేంద్ర వరము రాజధానిగా వేంగీ దేశమును పాలించిన తూర్పు చాళుక్య వంశపు రాజగు రాజ రాజనరేంద్రుని ఆస్థానమున నన్నయ యుండెను. నన్నయ అవిరళ జప హోమ తత్పరుడు; విపుల శబ్దశాసనుడు; బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడు. ఉభయ భాషాకావ్య రచనాభిశోభితుఁడు. కావుననే రాజ రాజు కోరికపై మహాభారత మంతటి గొప్ప ఇతిహాసమును ఆంధ్రీకరించుటకు పూనుకొనెను.

తెలుగుజాతి, తెలుగుభాష నన్నయ కెంతయో ఋణపడి యున్నవి. నన్నయనాటికి తెలుఁగు భాషయందుఁగల శబ్దజాలము మరియు ఛందో వైవిధ్యము చాల పరిమితముగా నుండెను. భారత మంతటి బృహద్గ్రంథమును తెనిగించుటకవి సరిపోవు. కావున నన్నయ సంస్కృత భాషలోని వేలకొలఁది శబ్దములను తీసిగొని తెలుఁగు విభక్తి ప్రత్యయములు వానికిచేర్చి తత్సమ శబ్దములుగా మార్చి తెలుఁగు భాషను విస్తృత పరచెను, మరియు దేశీయ ఛందస్సుకు తోడుగా సంస్కృతములోని వృత్తచ్ఛందములనుకూడ చేర్చెను.

తన కవిత్వమెట్లుండునో నన్నయయే స్వయముగా నిట్లు చెప్పుకొనెను:

"సారమతుల్ కవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్."

—అనగా ప్రసన్న కథాకలితార్థయుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థ సూక్తులు-ఇవి 'ఆయన కవిత్వంలోని ప్రధాన లక్షణములు. తరువాత కవులైన శ్రీనాథుడు, పోతన, అల్లసాని పెద్దన, రామరాజభూషణుడు మొదలగు కవులకు నన్నయ మార్గదర్శకుడయ్యెను.

ప్రస్తుత పాఠ్యభాగము సభాపర్వము ద్వితీయాశ్వాసము నుండి గ్రహింపబడినది. మాయాద్యూతమున ధర్మరాజు సర్వస్వమునొడ్డి ఓడిపోయిన పిదప దుర్యోధన దుశ్శాసనులు ద్రౌపదిని నిండు సభకు రప్పించి ఆమెను అవమానపరచుటకు యత్నింపగా వారిని సంహరింతునని భీముడు క్రోధముతో గావించిన భీమప్రతిజ్ఞలు ఈ కథ యందలి వృత్తాంతము.

ఈ భాగమున నన్నయ చూపిన నాటకీయత గమనింపదగియున్నది.

1. ప్రాతికామి – దుర్యోధనుని సేవకుడు
2. పని = ఆజ్ఞ
3. దుష్కితవుడు = దుస్ + కితవుడు = చెడు జూదరి
5. దురోదరము = జూదము
7. వైలక్ష్యంబు = విస్మితత్వము
   పిఱుంద = వెనుక
8. అపంగి = నమ్రాలయి
9. ఒడుచు = బలాత్కారముగా గ్రహించు
   పొలితి = (పొలతి) = స్త్రీ
   కోల్పడిరి = పోగొట్టుకొనిరి

11. అవబృథము=యజ్ఞావసానమున యజ్ఞకర్త శుద్ధికై చేయఁ
బడు కర్మము
తెమల్చి=పట్టుకొని
కురుకులాపశదుండు=కురుకుల+అపశదుండు = కౌరవ
వంశమునందు నీచుఁడు
12. అవధూతము=ఎగురగొట్టబడినది
అపస్పృష్టము=తోసివేయఁబడినది
13. భృశకోపనుడు=మిక్కుటమైన కోపముగలవాడు
18. కైతవము=కపటము, కితవత్వము
23 తఱుసంటి=గొప్పనైన
21. వెలి=వెలుపలిది
ప్రత్యాఖ్యాసము=నిరాకరించుట
26. నెట్టన=అనాలోచితముగా
ఉడుగక=విడువక
అపనీతము=తొలగింపబడినది
ఉఱ్కు=బలము, గర్వము
28. ఓఘము=ప్రవాహము
నిర్ఝరము=సెలయేఱు
అని=యుద్ధము
29. వ్యవసాయము=యత్నము (ఇచట ప్రతిజ్ఞ)
ధిక్ఛబ్దము=ధిక్+శబ్దము(ఛత్వ సంధి)
బెదరించెడి లేక భయపెట్టెడిమాట(ఇచటప్రతిజ్ఞ)
30. ఏర్పరింపగ=నిరూపించగ, నిర్ణయించగ
34. లగ్గు=మేలు

# 2. భేదోపాయము

## తిక్కన సోమయాజి

(ఆంధ్రమహాభారతము - ఉద్యోగ పర్వము - చతుర్థాశ్వాసము)

శ్రీ మదాంధ్ర మహాభారతమును రచించిన కవిత్రయములో తిక్కన సోమయాజి రెండవవారు. నన్నయగారారంభించిన మహాభారత రచనను కొనసాగించి విరాట పర్వము మొదలు చివరదాక మొత్తము పదునేను పర్వములు రచించిన మహాకవి తిక్కన.

తిక్కన క్రీ.శ. పదమూడవ శతాబ్ది (1210-1290)కి చెందినవాఁడు. నెల్లూరు మండలమునేలిన మనుమసిద్ధికి మహామంత్రి. తిక్కన తల్లిదండ్రుల అన్నమకొమ్మనలు. ఇతని పితామహుఁడగు మంత్రి భాస్కరుఁడు కూడ మంచి కవి. శత్రువులచే నొకమారు రాజ్యము గోల్పోయిన మనుమసిద్ధి ఓరుగల్లు నేలుచుండిన కాకతీయ చక్రవర్తి శ్రీ గణపతిదేవుని సాయముతో మరల రాజ్యమును సంపాదించి పెట్టిన రాజనీతిజ్ఞుడు తిక్కన.

తిక్కన రచించిన గ్రంథములలో నిర్వచనోత్తర రామాయణము మరియు ఆంధ్ర మహాభారతము బహుళ ప్రచారమునంది యున్నవి. ఇవిగాక విజయసేనము, కవివాగ్బంధనము, కృష్ణశతకము అనువానినికూడ రచించెనని ప్రతీతి గలదు. కాని అవి యిప్పుడు లభించుటలేదు. నిర్వచనోత్తర రామాయణమునఁ దానుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారఁగుఁడనని తిక్కన చెప్పుకొని యుండెను. ఉభయ కావ్యములనగా సంస్కృతాంధ్ర కావ్యములు. నిర్వచనోత్తర రామాయణమున నితడు భావికవులకు మార్గదర్శకము లగునట్లు కొన్ని కవితా సమయములను రూపొందించెను.

తిక్కనకీర్తి చంద్రికలను దశదిశల వ్యాపింపఁజేసినది అతని భారతము. ఇతనికాలమున మతసాంఘిక పరిస్థితులు అల్లకల్లోలముగా నుండెను. వీరశైవులకు, వైష్ణవులకును మధ్య ద్వేషవైరములు నెలకొనియుండెను. వీరశైవులు

శివుఁడే యధికుఁడనియు, వైష్ణవులు విష్ణువే గొప్పయనియు వాదులాడుకొను చుండిరి. తిక్కన ఈ భావమును నిరసించెను. అతని దృష్టిలో శివకేశవు లిద్దరికిని అభేదము. "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే" అను భావమున కతడు సిద్ధాంత రూపమునిచ్చి తద్వ్యాప్తినికోరి హరిహరనాథునకు తన భారతమును అంకితము గావించెను.

భారత రచనలో తిక్కన రాజనీతి, యుద్ధతంత్రము, ధర్మనీతి, తత్త్వోపదేశము, గృహజీవితము మున్నగు విషయము లెన్నింటినోవి స్తరించి వర్ణించియున్నాడు. కథను చెప్పుటలో నితడు నాటకీయశైలి నాశ్రయించెను. రసపోషణము నందితఁడు అత్యంత శ్రద్ధవహించెను. వర్ణనలు కావించు టలో నితడు అందెవేసిన చేయి. ఇతని వర్ణనలు రసానుగుణములై, దృశ్య ములను పఠితలకు సాక్షాత్కరింపఁజేయుచుండును. ఇతని కావ్యభాష నన్నయ వలె సంస్కృతపద భూయిష్ఠమైయుండక అలఁతియలఁతి తెలుగు పదములతో గూడియుండి రసోచితముగా నుండును. ఉభయ కవిమిత్ర, కవిబ్రహ్మ యనెడి బిరుదు లితనికిఁగలవు. 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లు'గా భారతమును రచించి తెలుగు దేశమునందు ధర్మచైతన్యమును ప్రసరింపజేసిన మహామనీషి యితడు.

ఈ పాఠ్యభాగము ఉద్యోగపర్వము నందలి చతుర్థాశ్వాసము నుండి గ్రహింపబడినది. ధర్మరాజు కోరికపై సంధికి కౌరవులను అంగీకరింపఁ జేయుటకై హస్తినాపురమునకు శ్రీకృష్ణుడు రాయబారిగ వచ్చి ఎంత ప్రయ త్నించినను ఫలితములేకపోయెను. కర్ణుని యండఁ జూచుకొని దుర్యోధనుఁడు అహంకార గర్వపూరితుఁడగుట శ్రీకృష్ణుడు కనిపెట్టి రాజనీతియందు చతు ర్విధోపాయము లనఁబరగు సామ దాన భేద దండములలో భేదోపాయమును ప్రయోగించి కర్ణుని పాండవులవైపు త్రిప్పుకొన ప్రయత్నించుట ఈ పాఠము నందలి కథావస్తువు.

1. చేతులలావు = భుజబలము; బహుపరాక్రమము
   వేసరి = కంచరిగాడిద

2. పనుపు = ఆజ్ఞ (ఇచట రాయబారము)
అని = యుద్ధము
పేరుక్కున = పేప + ఉక్కున = శీఘ్రముగా; అధికమైనగర్వముతో
ఉక్కివులు = మూర్ఖులు; కుత్సితులు
5. ఎఱఁగి = నమస్కరించి
6. బెరయ = చేరగా
బలసి = శక్తిమంతమై
9. వెడవెప = మిక్కిలిసూక్ష్మముగా
10. గాత్రములు = అంగము; శరీరములు
11. ఒరువులు = ఇతరులు (రూపాంతరము; ఒరులు)
15. ముట్ట = యుద్ధమునకైరాఁగా
21. పశువిశసనము = జంతుబలి
23. స్మయము = గర్వము; అహంభావము
ఒండె = అట్లుకానిపక్షమున; కాని
25. సులభ యవసేంధనంబును; యవస + ఇంధనము
యవసము = తృణము, గడ్డి; ఇంధనము = వంటకట్టెలు
(యుద్ధము సక్రమముగా కొనసాగుటకు సైనికులకు, అశ్వములకు ఆహారమందుచుండవలయును)
కానీనుడు = కన్యకు పుట్టినవాఁడు = కర్ణుఁడు
26. నిమిత్తములు = శకునములు
పోటు = యుద్ధము
30. మేకొను = అంగీకరించు
ఎక్కటి = ఒక్కఁడు
ఏడ్తెఱ = పరాక్రమము
పెంపు = మహత్త్వము; గౌరవము
31. ఉపశమము = శాంతి
దొసఁగు = దోషము, పాపము

32. వగపు=విచారము, దుఃఖము

33. ఆటోపము=గర్వము; సంభ్రమము

తక్కొరులు=ఇతరులు

ఆజి=యుద్ధము

34. ఆహవము=యుద్ధము

38. సంస్కారము=కర్మ

ఇహాముత్ర ఫలములు; (ఇహ+అముత్ర)

ఇహఫలములు, అముత్ర ఫలములు=భూలోకస్వర్లోకసుఖములు

40. కడిఁది పగరన్...కడవంగా

కడిఁది=బలవంతులయిన

పగఱు=శత్రువులు

(శత్రువులనెడి నదిని దాటుటకు)

ఏఁదెప్పగన్=ఏన్+తెప్పగన్

తెప్ప=నావ (నన్ను నావగా చేసికొని యని భావము)

41. పోలు=తగు, యుక్తమగు

అలు సేయక+మోసపుచ్చక; దాచక

బిట్టు+శీఘ్రముగా; దృఢముగా

# 3. తపస్సిద్ధి

## శ్రీనాథుడు

### (హరవిలాసము – చతుర్థాశ్వాసము)

శ్రీనాథుడు 14 వ శతాబ్ది ఉత్తరార్ధమునను, 15 వ శతాబ్ది పూర్వార్థమునను, జీవించిన మహాకవి. భీమాంబా మారయామాత్యుల కుమారుడు. బ్రాహ్మీదత్త వరప్రసాదుడై, చిన్ననాటనే ఆగమజ్ఞాన ఖనియై, సాంఖ్యాది సిద్ధాంతములను, శైవ వైష్ణవాద్యాగమములను, యోగ న్యాయ వైశేషికాది దర్శనములను ఆమూలాగ్రముగా నెఱిగిన మహాపండితుడు. అంతేకాక, తన కాలమున సాహిత్య సింహాసనము నధిష్ఠించిన కవిచక్రవర్తి. కవిసార్వభౌమ బిరుదాంకితుఁడు. రాజాస్థానములందు విద్యాధికారివంటి పదవులను నెఱపి, కనకాభిషేకాది సన్మానములను బొందిన విద్వత్కవి. అనేక రాజభోగముల ననుభవించిన పుణ్యశాలి. విపుల కావ్యేతిహాస పురాణముల నుండి, ఆంధ్ర రసికుల దృష్టిని, కావ్యముల వైపునకు మరలించిన యుగకర్త. సంస్కృతాంధ్రముల యందేకాక, ప్రాకృత శౌరసేన్యాది భాషలయందుఁగూడ మంచి పండితుడు. తన తరువాతవచ్చిన కవులకు తనశైలిని ఒఱవడిగా పెట్టిపోయిన కవితాగురువు సమాసఘటనము నన్నయనుండి, ముద్దులొలుకు తెలుగుపలుకుబడిని తిక్కననుండి, ప్రసన్నతను ఎఱ్ఱననుండిగ్రహించి, ఎవరికిని శిష్యత్వము నెఱపని శైలి నీతడు నిర్మించుకొనెను. ఇట్టి విద్వత్కవి అగుటవలననే "ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీనాటికాలంబులో"—అని రాజమహేంద్రవరపురాధీశ్వరుడగు వీరభద్రారెడ్డి ప్రశంస నందుకొన్నవాడు.

శ్రీనాథుడు బహుగ్రంథకర్త. ఆయన వ్రాసిన గ్రంథములలో మరుత్తరాట్చరిత్రము, శాలివాహనసప్తశతి, పండితారాధ్య చరిత్రముఅను గ్రంథములు మూడును నామమాత్రావశిష్టములైనవి. లభ్యములైన శృంగార నైషధము, హరవిలాసము, భీమేశ్వర పురాణము, కాశీఖండము, శివరాత్రి మాహాత్మ్యము మొదలగు గ్రంథములు ఆయనకు ఆంధ్ర వాఙ్మయమున అజరామరమైన కీర్తి ప్రతిష్ఠల నార్జించిపెట్టినవి.

అక్షర రమ్యతతోపాటు అర్థగౌరవమును సంతరించుకొన్న చక్కని శైలిచే శ్రీనాథుడు పెద్దనాది ప్రబంధకర్తలకు సన్నిహిత గురువయ్యెను. శ్రీనాథుని కవితయందు జిగియును బిగియును కలవు. ఆతని చేతియందు పరిపూర్ణ శిల్పసౌందర్యమును సంతరించుకొన్నది సీసపద్యము. జిగి, బిగి, నమ్రత, ఠీవి, తూగు మొదలగు గుణ సముదాయ మంతయు నీతని సీసముననే యేకత్ర సిద్ధించినది.

శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు చెప్పినట్లు, శ్రీనాథుని జీవిత చరిత్ర యనగా 15వ శతాబ్దపు ఆంధ్రదేశ చరిత్రము, ఆంధ్రవాఙ్మయము పొందిన సముచిత స్థానమును వర్ణించుటయే!

శ్రీనాథుని గ్రంథము లన్నింటిలోను మృదుమధురమైన రచనగలది 'హరవిలాసము'. గ్రంథములో మూడువంతులు తెనిగింపే అయినను, రచనా విధానము స్వతంత్రముగా నడిచినట్లు భాసించును. యథార్థానువాదములైన పద్యములలోను అతిసుకుమారమును, సుకరమును అయిన తెనిగింపు కాన వచ్చును. ఈ 'హరవిలాసము' శ్రీనాథుని బాలసఖుడును, కొమరగిరి వసంత భూపాలునివలన ఆందోళికా ఛత్రచామర తురంగాది అనేకవిధ రాజచిహ్నము లను బడసినవాడును అగు అవచి తిప్పయసెట్టికి అంకితమీయబడినది. ఇందు ఈశ్వరుని వివిధలీలలు వర్ణింపబడినవి.

ప్రస్తుత పాఠ్యభాగమగు 'తపస్సిద్ధి' హరవిలాసములోని చతుర్థాశ్వాస మునుండి గ్రహింపబడినది. దీనిలో కాళిదాస కుమార సంభవానుసరణము కాననగును.

తనను భర్తగా పొందగోరి తపమాచరించుచుండిన పార్వతి కడకు మాయాబ్రహ్మచారి వేషమున విచ్చేసిన పరమేశ్వరుడు, ఆమె మనోగత భావము నెఱుంగుటకు ఆమెను పరీక్షించిన విధానము ఇందు అతిమనోజ్ఞముగా వర్ణింపబడినది.

1. పంచాగ్ని మధ్యమున తపము: నాలుగుదిక్కుల అగ్నిహోత్ర లను ఉనిచి, వాటిమధ్య నిలిచి; ఐదవ అగ్నిహోత్రమువలె

ప్రకాశించుచున్న సూర్యుని చూచుచు తపస్సు చేయుట
ఉడుపతి = నక్షత్రముల కధిపతి = చంద్రుడు
కరుపలి = గాలి

2. అజినము = జింక చర్మము
ఆషాఢము = బ్రహ్మచారి పట్టుకొను మోదుగుదండము
త్రిజగన్మోహనమూర్తి = ముల్లోకములను మోహింపజేయు ఆకారము కలది

ఈ విశేషముచేత దేవాదిదేవుడగు ఈశ్వరుని కూడా ఆకర్షింపగల సామర్థ్యము కలదని ధ్వని.

5. త్రిషవణ స్నానము = ప్రాతఃకాల, మధ్యాహ్న, సాయంకాలములను మూఁడు కాలములయందు నిర్వహించు హోమములకు ముందు చేయు స్నానము
ఇధ్మము = చిదుగులు, వంటచెఱకు
సత్త్వములు = జంతువులు
దేహయాత్ర = జీవయాత్ర

9. కుందాడు = దుఃఖించు

10. ప్రజానాథుడు = ప్రజాపతి
పడిసన్న = ప్రసిద్ధిపొందిన
ప్రాతి = గొప్ప

11. కలమాగ్ర పింగళ = కలమధాన్యపు మొక్క చివరిభాగమువలె ఎఱ్ఱనైన.

12. తరళేక్షణ = ప్రకాశించు చూపులుగలదాన!
ఈ సంబోధనవలన ఈశ్వరుడుఆమెచే ఆకర్షితుడైనట్లుస్పష్టము

13. భర్గుడు = కాముని నిర్జించినవాడు
ఈశ్వరుడు కాముని జయించినవాడు కాన తపస్సుచే స్వాధీన పరచుకొనదలచినది పార్వతి-కాన ఇట ఈశ్వరుని 'భర్గు' డనుట సార్థకము.

14. పెంజిలువ పేరు = పెద్దపాముల వరుస

15. మనువు = జీవనము, వరణము

ముదిగోద = ముసలి యెద్దు

16. అభవుడు = పుట్టుకలేనివాడు = ఈశ్వరుడు

వయస్సు తెలియని ముదుసలితోనని పైకితోచునట్లును, పుట్టుకలేని సాక్షాత్తు పరమేశ్వరుడని అంతరార్థముతోను ఈ విశేషణము వాడబడినది

సౌగంధిక బంధురేఖ = చంద్రరేఖ

17. బైసి = భాగ్యము

18. యూపసత్క్రియ = యజ్ఞ యాగాదులలో బలినిచ్చు పశువును కట్టిపేయుటకు ఉపయోగించు స్తంభమును యూపమందురు. ఆ సమయమున దానిని యథావిధిగా పూజింతురు.

20 శంభుడు = శుభములిచ్చువాడు - ఈశ్వరుడు

23. గిరీశానుండు = ఈశ్వరుడు

24. వరవుడు = దాసుడు

# 4. వామన చరిత్రము

## బమ్మెర పోతన

( శ్రీమదాంధ్ర మహాభాగవతము – అష్టమస్కంధము )

భక్తిరసభరితమైన అనన్యసామాన్యకవితా ప్రతిభతో ఆంధ్రదేశమును ఉఱ్ఱూతలూగించిన కవిశేఖరుడు పోతనామాత్యుడు. లక్కమాంబా కేసనల కుమారుడైన పోతన సహజ పాండిత్య బిరుదాంచితుడు. తెలంగాణములోని ఓరుగల్లు పోతన నివాసము. ఈతడు 15వ శతాబ్ది ఉత్తరార్ధమున జీవించిన కవీశ్వరుడు.

వ్యాసమహర్షి వేదములను వింగడించి, పంచమ వేదమగు భారతమును విరచించియు, చిత్తశాంతి లభింపక సరస్వతీ నదీ తీరమున విచారగ్రస్తుడై కూర్చుండెను. అప్పుడు నారదుడు ప్రత్యక్షమై "నీవు ధర్మములన్నియు చెప్పితివి కాని, విష్ణుకథలు చెప్పవైతివి. గుణములెన్నక ధర్మములు చెప్పి నంత మాత్రమున విష్ణుడు మెచ్చునా? హరిని నుతింపమియే నీవంతకు కారణ" మని పలుకగా, వ్యాసుడు సంతుష్టుడై భువన క్షేమంకరమైన భాగవతమును విరచించి, మోక్షార్థియై శుకుని చే చదివించెను, అది—

"లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతా శోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై."

భాగవతము యొక్క మహిమము ఇంతయని చెప్పలేము. శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భాగవత కథను వినిపింప నారభించు సమయమున సుర లమృతభాండముతో నచ్చటికి వచ్చి, భాగవత కథామృతమును తమ కిచ్చి తాముతెచ్చిన అమృతభాండము నందలి యమృతమును బరీక్షిత్తున కిమ్మని శుకుని ప్రార్థించిరట శుకుడు సురలుత్తమ భక్తులు కారని తలంచి వారికి భాగవతసుధ నొసంగుట కంగీకరింపదయ్యెనట. దీనినిబట్టి భాగవతము భక్తజనైకలభ్యమనియు, అమృతాధిక ఫలప్రదమనియు స్పష్టము.

పోతన విరచితమైన భాగవతములోని కొంతభాగము శిథిలముకాగా, ద్వితీయ తృతీయ స్కంధములలోని కొంతభాగమును ఏకాదశ ద్వాదశస్కంధములను వెలిగందల నారయయు, పంచమ స్కంధమున కొంత భాగమును గంగనయు, షష్ఠస్కంధమును ఏర్చూరి సింగనయు పూరించిరి. అనువాద విషయమున పోతన కవిత్రియము వారి స్వతంత్రవిధానమును, సమకాలికుడైన శ్రీనాథుని భావానువాద విధానమును కూడ అనుసరించెను. అంతేకాక భాగవతమునకుగల సుమారు 30, 40 వాఖ్యానములలోను ప్రసిద్ధమైన శ్రీధరాచార్యుని భావార్థదీపికను గూడ పోతన నిశితముగా పరిశీలించి, గూఢముగా నున్నచోట్ల ఆ వాఖ్యానమును కూడ చక్కగా ననువదించెను. అదియును కాక—

"కొందఱికిఁ దెనుగు గుణమగు
కొందఱికిని సంస్కృతంబు గుణమగు రెండున్
కొందఱికి గుణములగు నే
నందఱి మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్"

అని ప్రతినచేసి, దానిని యథాక్షరముగా నిర్వహించెను.

పోతనకు భక్త్యావేశము మెండు, అందువలననే మూలమున 22 వేల శ్లోకపరిమితమైన సంస్కృత భాగవతము, తెనుగున 30 వేలకు పెరిగినది. తన్మయుడై భాగవతమును తెనిగించి, చిన్మయమైనఆనందమును పంచిపెట్టిన పుణ్యమూర్తి ఆయన!

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్"

అను నవవిధ భక్తులకు భాగవతము ఉదాహరణప్రాయమైనది.

నన్నయ ధారాశుద్ధి, తిక్కన రసాభ్యుచిత బంధము, ఎఱ్ఱన సూక్తి వైచిత్రి, సోముని సాహితీవిదగ్ధత, శ్రీనాథుని క్రొత్తయెత్తుగడలు, ఈఐదును కలిసిన పోతన శైలియొక్క పాంచభౌతిక శరీరమగును. అయన శైలిగంగా

ప్రవాహమువంటిది. అక్షరవిన్యాసము, అర్థగాంభీర్యము, అలంకార సౌభాగ్యము కలిపి పోఁపోసినట్లు ఆయన రచన గోచరించును.

ప్రస్తుత కథాభాగము భాగవతములోని అష్టమ స్కంధము నుండి గ్రహింపబడినది. శ్రీమహావిష్ణువు వామనమూర్తియై బలిచక్రవర్తి కడకువచ్చి దాన పరిగ్రహణముచేసి, బలి ననుగ్రహించుట ఇందలి ఇతివృత్తము.

1. హరిహయుడు=పచ్చని గుఱ్ఱములు గలవాడు=ఇంద్రుడు
3. బహుధా జల్పన్నిశాటంబు=పలువిధముల పేర్కొనుచున్న రాక్షసులు గలది
విభ్యత్=భయము నొందిన
ధ్వజినీ=సైన్యము
ఘోటము=గుఱ్ఱము
మఖాంతర్వేదికాచాటమున్=యజ్ఞశాల లోపలి అరుగులుగల భాగమును
4. హయమేధము=అశ్వమేధము
5. స్వస్తి=శుభము, మంగళము
8. అభ్యాగతుడు = యజ్ఞాదిసమయములలో దానముగోరి వచ్చినవాఁడు
'అభ్యాగత స్స్వయం విష్ణుః'— అను సూక్తి వలన, ఇచ్చట అభ్యాగతుడుగా వచ్చినవాడు సాక్షాత్తు విష్ణుమూర్తియే కాని, సామాన్య బ్రహ్మచారికాడను ధ్వని.
9. సఫలము య్యెఁన్ జన్మమున్—కడుధన్యాత్ముఁడనైతి—కోరికల్ గడతేఱెన్—ఇవి బలికి సమీపించిన అంత్యకాలమునకు సూచకములు
10. నికేతనములు=ఇండ్లు
11. వైరోచని=విరోచన తనయుడు=బలి
ఈశ్వరుఁడు—సాక్షాత్తు పరమాత్మయనుట

12. ఈ పద్యములో మొదటినుంచి చివరివరకు వామనుడు తాను పరమాత్మనని సూచనగా చెప్పుచున్నాడు.

15. బ్రహ్మకూకటి ముట్టెద=బ్రహ్మానందము పొందెదను; బ్రహ్మదేవుని పిలకకూడ పట్టెదను అని ఛావిఃథా సూచనము.
దానకుతుకసాంద్ర—ఇది చాలా చరకు సార్థకమైన విశేషణము బలిచక్రవర్తి దానవిముఖుడు కాకుండునట్లు బంధించునది.

16. పరమ యాచకుడు=ఉత్కృష్టమైన యాచన చేయువాడు
ప్రదాత=ప్రకృష్టముగా దానమిచ్చువాడు

18. గృహమేధి=గృహస్థుడు

19. బ్రహ్మాండంబు=గొప్పకార్యము; బ్రహ్మాండమంతయు నిచ్చుటయేయని ధ్వని.

21. ఖర్వుడు=వామనుడు—పొట్టివాడు
వితరణముఖరుడు=దానగుణము ముఖ్యమైనవాడు

22. వామనమూర్తియై వచ్చినది శ్రీమహావిష్ణువని గమనించినాడు శుక్రాచార్యుడు. శుక్రాచార్యుడు సామాన్యుడుకాడు. "నిజవిచారయుక్తదనుజరాజ్య చక్రుడు." బలిచక్రవర్తిని, అతని రాజ్యమును రక్షించుట అతని విధి. కావున యదార్థ విషయమును ఇచట వ్యక్తం చేసినాడు.

23. విశ్వంభరుడు=విశ్వమును భరించువాడు
త్రివిక్రముడు=మూడులోకములను మూడడుగుల చే కప్పువాడు

28. నిరయము=నరకము

29. తారాధ్వము=నక్షత్రమార్గము

31. మాణవకోత్తమ=బాలకశ్రేష్ఠా!

32. యోగిసుమనస్సంప్రార్థిత శ్రీదమున్ — యోగులు మంచి హృదయముతో కాంక్షించునది అదే అని ధ్వని.

శాదము = బురద

నళినామోదము = పద్మమువలె సంతోషమును కలుగజేయునది

33. సురలోక సముద్ధరణము = భవహరణము — వామనుని పాదము బలిచక్రవర్తికి భవహరణము, దేవతలకు సముద్ధరణమునైనది

34. వార్చి = ఆచమనము చేసి

35. క్రియాక్షిప్రుడు = పనియందు త్వరగలవాడు

36. శతమఖలోకమున = ఇంద్రలోకమున

38. మహర్వాటి = మహర్లోకము

సత్యపదము = సత్యలోకము

39. ఛవిమత్ = కాంతిమంతమైన

40. తొడి = ధరించి

వేండ్రింబై = అధికమై

# 5. చిత్రాంగద వివాహము

## చేమకూర వేంకటకవి

(విజయ విలాసము - ద్వితీయాశ్వాసము)

విజయనగర సామ్రాజ్య పతనానంతరము ఆంధ్ర సరస్వతిని ఆదరించి గౌరవించినవారు తంజాపూరునేలిన నాయకరాజులు. వారిలో 1600 నుండి 1630 వరకు తంజావూరును పాలించిన రఘునాథరాయలు విద్వత్కవి. కృష్ణ దేవరాయల తరువాత అంతటివాడు, సంగీత సాహిత్యవిశారదుడు, కవిపండిత పోషకుడు, కృతికర్త, కృతిభర్త కూడ. అవక్ర పరాక్రమశాలియై జనరంజక ముగా దేశమును పాలించిన గొప్ప రాజనీతి నిపుణుడు. రామాయణము, వాల్మీకి చరిత్ర, నలచరిత్ర, జానకీపరిణయము వంటి గ్రంథములను వ్రాయు టయేకాక, సంస్కృతమున పారిజాతాపహరణమును 2 జాములలో ఆశువుగా చెప్పి తండ్రిచేత కనకాభిషేకమును పొందిన కవిశేఖరుడు.

శ్రీకృష్ణదేవరాయల సభామంటపమునకు భువన విజయమని యుండి నట్లు, రఘునాథ నాయకుని సభామంటపమునకు 'విజయ భువన'మని పేరుండె డిది. ఆ విజయ భువనమును చేమకూర వేంకటకవి, కృష్ణాధ్వరి, యజ్ఞ నారాయణ దీక్షితులవంటి కవీశ్వరులేకాక, రామభద్రాంబ, మధురవాణి వంటి కవయిత్రులుకూడ అలంకరించి యుండెడివారు. వారందరిలోను చేమకూర వేంకటకవి తలమానికము వంటివాడు. శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ కవితా ధురంధరుడై, విజయ విలాసము, సారంగధర చరిత్రములను వ్రాసిన కవిశేఖరుడు. ఆనాటినుండియు వేంకటకవినిగాని, ఆయన గ్రంథరాజములను గాని, ప్రశంసింపని కవులుగాని, పండితులుకాని, విమర్శకులుకాని, ఆంధ్రదేశ ములో ఉండరనియన్నచో అది అతియోశక్తి కానేరదు. కొందఱు "చేమకూర పాకాన పడిన"దన్నారు. "ఇంటిపేరు నసగా ఉన్నా కవిత్వం పసగాఉన్న" దన్నారు మఱికొందఱు. "చక్కెర మళ్లలో అమృతం పారించి పండించిన చేమకూర"అని ఒకరు ప్రశంసించినారు. ఇంకొకరు- "కడుం గడుం గడుసు వాడు" అని మెచ్చుకొన్నారు.

అప్పటికే అల్లుకొని పాకి వర్ధిల్లిన ప్రబంధలత, పెద్దన, రామరాజ భూషణుడు, సూరన, రామకృష్ణులవంటి కవిశ్రేష్ఠుల దోహదముతో మూడు పూవులు ఆరుకాయలుగా అలరారినది. శబ్దప్రయోగము, వర్ణనాచమత్కారము, చిత్రవిచిత్ర కల్పనలు, రసపోషణాది విశిష్ట గుణాదులలో ప్రబంధ కవులు చేసిన కృషి అనన్యసాధారణము. వారు తొక్కని చమత్కార మార్గములుకాని, విడిచిపెట్టిన అలంకారిక విధానముగాని లేవని చెప్పవచ్చును. అటువంటి సమయములో, ప్రబంధకవుల కవిత చే ప్రభావితులైన పండిత లోకమును మెప్పించుట అసాధారణ కార్యక్రమము. ఈకష్టమును బాగా గ్రహించిన చేమకూర వేంకటకవి, ఇతరుల పోకడలను ఉద్దేశపూర్వకముగను, ప్రయత్నపూర్వకముగను విడిచిపెట్టి, పదప్రయోగము మొదలు రసపోషణము వరకు అన్నివిషయములలోను స్వతంత్ర విధానమును అవలంబించి, ఆంధ్రవాఙ్మయములో అద్వితీయమైన కీర్తి ప్రతిష్ఠల నార్జించుకొనినాడు. రఘునాథరాజు కూడ చేమకూర కవిని- "ప్రతి పద్యమునందుఁ జమత్కృతిగలుగంగ జెప్పనేర్తువు.. క్షితిలో నీమార్గమెవరికిన్ రాదుసుమా!"- అని ప్రశంసించినాఁడు మొత్తము మీద ప్రబంధానంతర యుగములో విజయవిలాసమువంటి గ్రంథము వేరొకటి లేదని చెప్పవచ్చును. వేంకటకవి దానిని రఘునాథ భూపాలునకు అంకితము గావించినాడు.

విజయ విలాసము మూడు ఆశ్వాసముల ప్రబంధము. పూర్వకృత సమయ భంగమునకుగాను వాటిల్లిన భూప్రదక్షిణమునకై బయలుదేరిన అర్జునుడు, ఉలూచి, చిత్రాంగద, సుభద్ర అను ముగ్గురు లలనామణులను వివాహమాడిన వృత్తాంతము.

ప్రస్తుత పాఠ్యభాగమగు 'చిత్రాంగద వివాహము' విజయ విలాసము ప్రథమ ద్వితీయాశ్వాసముల నుండి గ్రహింపబడినది. భూప్రదక్షిణమునకు బయలుదేరిన అర్జునుడు, తీర్థయాత్రను సేవించుచు, శ్రీశైల కాంచీపురాది క్షేత్రంబులు దర్శించి, పాండ్యదేశమున మణిపురంబు చేరి, దానినేలు మలయ

ధ్వజ మహారాజు కుమార్తెయగు చిత్రాంగదను చూచి, వలచి, వివాహం మాడిన వృత్తాంతము ఇందు మనోజ్ఞముగా చిత్రీకరింపబడినది.

1. ధేను+ఉత్తంసుడై—శ్రేష్ఠమైన ఆవుకలవాడై
3. ధవళముల్—పెండ్లి పాటలు
హవణిన్—విలాసమును
హాళిన్—సంతోషముతో
బిత్తరము—శృంగార చేష్ట
బుహ్వానన్—బువ్వంపు బంతిని
4. పైడిలో వెలంది—బంగారములో మిక్కిలి వెలగలది
లేనెలంత—(విదియనాటి) బాలచంద్రుడు
సుపాణి—శుభ్రమైన కాంతిగల ముత్యములు
మృగీమదశ్రీబిడారు—కస్తూరియొక్క నల్లనికాంతికినివాసస్థానము
6. మేతులకింపుల—శరీరపు నిగనిగల
పిసాళి—మనోహరమైన
మిసిమిసికి—ప్రకాశమునకు
క్రొత్త+మించు—తొలకరి మెరుపులు
ఏతుల వెలందులు—సాధారణ స్త్రీలు
8. విధు చకచకలును—చంద్రుని వేడికాంతిని
అంపసెకలు—బాణములవలన కలిగిన తాపములు
శారీ—గోరువంక
మధులిట్టులు—తుమ్మెదలు
9. ఇందిందిరవేణి—తుమ్మెదలవంటి కొప్పుగలది
ఎలతేనియలో—క్రొత్తపూల తేనెలో
వికరంపు తేట—శ్రేష్ఠమైన సారము
10. నాళీకము—పద్మము
రేకగు—అంగమగు, రాత్రికి తగినదైన

ఎదను నిల్పినదాఁకన్=మనసులో నిలుపుదనుక, వక్షస్థలము మీఁద నిలుపుదనుక

11. మామక+ఆగమనవార్త=తనరాకకు సంబంధించిన వార్తను,
మామకు+ఆగమనవార్త=మామగారు కాబోవు మలయధ్వజ రాజునకు తనరాక విషయమును
మామ + కాగ + మనవార్త = మామ అగునట్లుగా మన విషయమును
అర్జునుని ముఖము 'నవాంబుజము'. మలయధ్వజక్షితీశుడు కమలహితుడు. కావున అర్జునుడు మలయధ్వజ మహారాజునకు వార్త పంపుట సమంజసము.

13. దొఱసి=కలిసి
హాళాహళిన్=చూడవచ్చిన వారల సందడిని
కడకు+ఒత్తెడి=ప్రక్కలకు నొత్తుచుండిన
పౌజుల దిక్కు=సేనలవైపు

14. మనసునఁ బుట్టినవాఁడు=మన్మథుఁడు

15. రూపునఁ బొసంగుటెకాదు=రూపములో మాత్రముఉండుటయే కాదు
దొఱయన్+చాలినవాఁడు=పొందనర్హత కలవాడు

17. సుత్రామనిభుడు=ఇంద్రునితో సమానమైనవాడు
చిత్ర+అంగద+యుత=అద్భుతమైన కాలియందెతోనున్న

18. హరిపతి=సింహరాజు, అశ్వపతి
గరువపు=ఒయ్యారపు
వరవర్ణిని=సుందరి
విజయనగర రాజులు నరపతులు, బహమనీరాజులు అశ్వపతులు, ఉత్కళదేశ రాజులు గజపతులు, విజయనగర రాజగు శ్రీకృష్ణ దేవరాయులకును, అశ్వపతులగు గజపతులకును జరిగిన యుద్ధ

ములలో వారు ఓడిపోయిన చారిత్రిక విషయము ఇందు ధ్వనింప జేయబడినది.

19. ఈడిత=పొగడబడిన
20. చూపఱు=ప్రేక్షకులు
21. చేరల=అరచేతులతో
మొలక మెఱుంగు నీలములు=లేతకాంతుల నీలమణులు
కలచు=కలతపెట్టు
రువాణపున్+కవునున్=అందమైన నడుమును
22. అంగజ రాజ్యము—మన్మథ
23. రంగు+ఔ=ముద్దులొలుకు
పాలొప్పంగిన కైవడిన్—పా
పూలు రేకెత్తినట్లనె—పూలు

# 6. జననింద

## కంకంటి పాపరాజు

(ఉత్తర రామాయణము - ఆరవయాశ్వాసము)

కంకంటి పాపరాజు క్రీ. శ. 1669 ప్రాంతమునందు జీవించియున్నవాఁడు. అనంతర ప్రబంధ యుగమునందు ప్రసిద్ధులయిన కొద్దిమంది తెలుఁగు కవులలో పాపరాజు లెక్కింపఁ దగినవాఁడు. ఈతఁడు ఉత్తర రామాయణ మను కావ్యమునేకాక విష్ణుమాయా విలాసమను యక్షగానమునుగూడ రచియించెను. పాపరాజు ఆరువేల నియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. ఈతని కవిత్వము మిక్కిలి మనోరంజకమయి ధారాశుద్ధి శోభితమయినది. పాపరాజు సంస్కృతమున వాల్మీకి మహాకవిరచించిన రామాయణ కావ్యములోని ఉత్తర కాండ కథలో సందర్భోచితముగ నూతన కథాంశములను జేర్చి చక్కని వర్ణనలతో నుత్తర రామాయణను రచించెను.

ఉత్తర రామాయణమున సీతపరిత్యాగ ఘట్టము చాలా రసవంతమయినది. తెలుఁగులో రామాయణములు చాలా వచ్చినవి. వానిలో సీతాపరిత్యాగ కథనుకూడ నాయామహాకవులు చక్కగనే వ్రాసిరి. అయినను కంకంటి పాపరాజు రచించినంత రసవంతముగ రచించినవారు మాత్రము కానరారు. పాపరాజు రచనలో నీభాగము బహుప్రశస్తమయి ప్రసిద్ధిగాంచినది.

ఉత్తర రామాయణమును పాపరాజు శ్రీకృష్ణున కంకితముగావించెను. పుష్పగిరి తిమ్మన పాపరాజునకు మిత్రుఁడు. అతఁడుత్తరరామాయణ రచనలో పాపరాజునకు తోడుపడినాఁడఁట.

జనాపవాదమును భరించలేని శ్రీరాముఁడు సీతనరణ్యమున విడిచి రమ్మని లక్ష్మణున కాజ్ఞయిడెను. లక్ష్మణుఁడామె నరణ్యమునకుఁ గొనిపోయి అక్కడ నామెకు రామాజ్ఞనుదెలిపి మఱలివచ్చుట, సీతను వాల్మీకి తనయాశ్రమమునకుఁ గొనిపోవుట, యీపాఠ్యభాగ కథాంశములు. మిక్కిల కరుణరస స్ఫోరకముగా సాగినదిందలి రచన. ప్రతి పద్యమును నొక రసగుళికయని

చెప్పఁదగును. శబ్దార్థాలంకారములు, సంభాషణ రామణీయకము, రసోచిత మయిన శైలియిందు గమనింపఁ దగినవి.

1. దైత్యుచే=రాక్షసుని చేతిలో, రావణుని చేతిలో
ఎగ్గు=నింద
2. క్షుల్లకజన=నీచజన
భల్ల=బల్లెము
అగలన్=పగిలిపోఁగా
ఆయల్లకభరము=ఎడబాటుభారమును
ఇందుఁగల రూపకాలంకారము సొగసును జూడవలెను.
3. మహాతపోనిధులు=గొప్పదగు తపస్సే ధనముగాఁగలవారు
వారు తలంచినచో నీయాపద తొలగవచ్చునని సూచన. వారు దయాసముద్రులు గనుక అది అసాధ్యముకాదనుట.
అనదతనంబు=దిక్కులేకుండుట
4. ఎడ=ప్రదేశము
పొంపిరి=సాంద్రిత
5. వామలూరుజ=వాల్మీకి
అంతిక భూమి=సమీప ప్రదేశము
వేగించు=కష్టముగా గడవఁజేయు
క్రమియించు=కడపు
6. పుయిలోడి=సంకోచించి
ఈదఁగలాఁడు=ఈదఁగలవాఁడు
7. దాయలు=పగవారు
ఇక్కడి లోక వ్యవహారములోని చమత్కారము గమనింపఁ దగినది.
8. మిడిమేలము=వ్యతిరేకమయిన
మల=కొండ

చంద్రశాల=డాబాప్రదేశము, శిరోగృహము
గహనము=అరణ్యము
నక్ర=మొసలి
ప్రస్తరము=రాయి
ఇందుమణివేదిక=చంద్రకాంత శిలలతో నిర్మించిన గద్దె
నిలిచెదు=నిలిచెదవు
జనయిత్రి=తల్లి

9. సౌశీల్యము=మంచి నడవడి
మేల్బంతి=ఆదర్శము

10. చేడ్పడి=బాధపడి
బడిబడిన్=వెంటవెంట
పొరసి=పొంది
కన్నుఁ దామరలు=తామర పువ్వులవంటి కన్నులు
జాళువా=బంగారము
నిట్టూర్పు సెగలు=నిశ్వాసములవలని వేడిగాడ్పులు
చిగురువాతెఱ=చిగురువంటి పెదవి
ఉడుగణములు=చుక్కల గుంపులు
బెడఁగు=అందము
చేర్చుక్క=పాపటలో ధరించు ఆభరణము
తెరలన్=పక్కకు తొలగగా
చికుర నికరంబులు=వెంట్రుకల గుంపులు
అళిక ఫలకము=విశాలమయిన నుదురు
విరులసరులు=పూలదండలు
ఆడలు=కలతపడు
పెన్నెఱులు=పొడగైన వెంట్రుకలు
అంసభాగము=భుజశిరోభాగము
జడుపుఁ జెమ్మట=భయము వలనఁ కలిగిన చెమట

నెమ్మేను—అందమయిన శరీరము
కనంక—ఓర్పు
ఇమ్ముచూపు—స్థానమగు
సాధ్వసము—భయము
సాధ్వి—స్త్రీ
కరుణము—శోకము
కిరణములు—అవయవములు
వేలుగీలుకొలుపు—వేలుంచుకొను
ఈ వచన రచనలోని శైలీ సౌందర్యము చూడఁదగినది. ఇందలి వర్ణనా నైపుణ్యము కనుఁగొనఁ దగినది. శబ్దార్థాలంకారముల లోని అందము ఆలోచింపఁ దగినది. అనుప్రాసము, ఉత్ప్రేక్షలు స్వభావోక్తి మొదలగు అలంకారములిందున్నవి.

11. వసుధాధిపునానతి—రామాజ్ఞ; రాజాజ్ఞ కూడ
విధి—దైవము

12. ఎడపక—వెనుదీయక
అఘము—పాపము

15. కళవళము—కలత

17. కాయము—శరీరము

18. ఎగ్గు—నిందావాక్యము

16. కాకుత్స్థుఁడు—కకుత్స్థుఁడను రాజవంశమునఁ బుట్టినవాఁడు. శ్రీరాముడు

20. ఈ పద్యరచనలోని కవితావేశము గుర్తింపఁ దగినది.
ఆకర్ణాయత నేత్రము—చెవులవఱకు వ్యాపించిన విశాలములయిన కన్నులు గలది.
గల్లము—చెక్కిలి
సురదనము—మంచి పలువరుస గలది
క్రమస్మితచంద్రిక—మనోహరమగు చిఱునవ్వను వెన్నెల

ఈ కాయమ్మునన్—ఈశరీరముతో, ఈజన్మయందు దన్నమాట

21. అయోనిజ – మాతృ గర్భమునుండి కాక నాగటి చాలునందు జన్మించినది.

మిథిలేంద్రుపీటన్—జనకమహారాజు పట్టణమున

అంగరాగములు—మైపూతకుపయోగించు ద్రవ్యములు

తెగువ—సాహసము

అభాగ్యము—దురదృష్టము

22. విపదంబుధి—ఆపదయను సముద్రము

ఏకరణిన్—ఏవిధముగా

తరింతున్—దాటుదును

అనువు—విధము

23. పెక్కు తెగలన్—అనేక విధములుగా

వగలన్—చింతలతో

కొామరు—విధము

24. తెగువకుఁ జొచ్చి—సాహాస కార్యము చేసి

సీత సాహసించి ఆత్మహత్య వంటి దానికి పూనుకొన్నచో శ్రీరాముడు మరల నిందలపాలగును. కనుక తానట్టిపని చేయనని సీత చెప్పుచున్నది.

ఎల్లగతులన్—అన్నివిధములుగా

25. కృపాళువు—దయా స్వభావము కలవాఁడు

రామ + అవనీంద్రునకు—రాజయిన రామునకు, రాముఁడు రాజధర్మమును నిర్వహించినాఁడను సూచన

ఏడుగడ—అన్ని విధముల రక్షకులు

నెమ్మి—ప్రీతి

26. నెలంతుక—స్త్రీ

27. ధేనువును బాయఁజాలని వత్సంబును బోలి— ఆవును విడిచివెళ్ళ లేని లేగవలె

ఈ పోలికలోని యౌచిత్యమును గుర్తించునది.

28. వడఁకాడన్—వడఁకుచుండఁగా
తాపస కామినులు—మునిపత్నులు

29. కాంతారము—అడవి
అచ్చెంతన్—ఆ సమీప ప్రదేశమునందు
అరుదంది—ఆశ్చర్యపడి

30. విముక్త+ఆబ్జ—తామరపూవును వదలివచ్చిన
శ్రీ వామాక్షి—లక్ష్మీదేవి
జేజేరాజు దేవేరి—శచీదేవి
లతాంగి—స్త్రీ
పూఁబోడిఁగావందగున్—ఆ స్త్రీని కాపాడఁదగును

31. అంతర దృష్టి—లోచూపు
దేవేరి—రాణి
అర్ఘ్యపాత్రి—పూజాద్రవ్యములుగల పాత్రి

32. అనునయించి—ఓదార్చి
నిర్వ్యాజబంధు జనులు — ఎట్టి కపటములేని బంధువులు
అర్థాంతరన్యాసమను నర్థాలంకార మిందుఁగలదు.